# పరీక్షల సమయమా? కష్టపడి చదివే సమయం...



పూర్తిగా ఆరోగ్యంగా ఉండాల్సిన సమయం,
**కాంప్లాన్**®
తీసుకోవలసిన సమయం.

## కేవలం **కాంప్లాన్**®లోనే అతనికి అవసరమయ్యే అధిక పోషణనిచ్చే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.

పిల్లలూ బాగా ఆరోగ్యంగా ఉండటం అవసరం, అది మరి వాళ్ళు పరీక్షలకి చదువుతూన్నప్పుడు మరీ అవసరం. అందుకే మరి తల్లులకు తెలుసు పరీక్షల సమయం అంటే కాంప్లాన్ తీసుకోవలసిన సమయం అని.

ప్రోటీన్లు, హుటాహుటీగా పెరుగుదలకు తోడుపడే పోషక పదార్థాలు. కాంప్లాన్‌లో ప్రోటీన్లు (20%) ఉండటమే కాకుండా పిల్లలకోసం అత్యుత్తమమైన ప్రోటీన్లు (పాల ప్రోటీన్లు) ఉన్నాయి. దాంతోబాటే, పిల్లల అధిక పోషణకు అవసరమయ్యే 22 యితర కీలక ఆహార పదార్థాలు, అంటే కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ పదార్థాలూ అటువంటివి ఉన్నాయి.

మీ పిల్లలకి యివ్వడం మొదలెట్టండి కాంప్లాన్—రోజుకు రెండుసార్లు ప్రతిరోజూ. గుర్తుంచుకోండి, కాంప్లాన్, డాక్టర్లు ఎక్కువగా సిఫార్సుచేసే ఆరోగ్యబద్ధమైన ఆహారం.

కాంప్లాన్ రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ-కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరుకుతుంది—ప్లెయిన్ (సాదా) గా కూడా. దీని రుచి అంటే మరి పిల్లలకెంతో ఇష్టం!









**కాంప్లాన్**® – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

# "గ్యాస్ సిలెండర్‌ని ఎరువుతెచ్చుకోకండి–
# గొడవ నెత్తిన
# పెట్టుకోకండి."



సిలెండర్ ఎరువు తెచ్చుకోవడం చట్ట విరుద్ధం; ఎందుకంటారా, సిలెండర్ కంపెనీది, అది 'లీజ్' చేసింది, యిచ్చిందీ కేవలం మీకు. అలా ఎరువు తీసుకువెళ్ళిన వాళ్ళకి రీఫిల్ యివ్వడంగాని లేదా మెకానిక్ సేవా సౌకర్యాన్ని యివ్వడం గాని నిరాకరించవచ్చు.

అదిగాక అసలైన ముఖ్యమైన విషయం ఏమిటంటే, సిలెండర్‌ని ఎరువు తెచ్చుకోవడం అపాయకరం కావచ్చు.

అన్ని రెగ్యులేటర్లూ అన్ని సిలెండర్లకూ పట్టవు. అలా ఎరువు తెచ్చుకున్న సిలెండర్‌లోంచి గ్యాస్ గనక లీక్ అయితే మీకిక గొడవా, యిబ్బందీను.

భద్రతను దృష్టిలో వుంచుకుని, మీరెప్పుడూ సిలెండర్‌ని ఎరువు తెచ్చుకోనూ వద్దు, యివ్వనూ వద్దు.







**Bharatgas**

**కుకింగ్ గ్యాస్‌ని మీ నేస్తంగా చేసుకోండి.**

ARTIG 4366 ,TEL

*ప్రజల హితంకోసం భారత్ పెట్రోలియమ్ కార్పొరేషన్ లిమిటెడ్ వారిచే యిది విడుదల చేయబడినది.*

## సంక్రాంతి సంచిక

సంక్రాంతి సంచికగా వెలువడిన మీ పత్రిక చాలా బాగుంది "పసిడి బొమ్మ" సీరియల్. అప్పుడే మమ్మల్ని ఆకట్టుకుంది "కొయ్యబొమ్మలు" కథ బాగుంది

ఎం. రఘు, విశాఖపట్నం.

## ముఖ చిత్రం

25-1-85 నాటి ముచ్చెర్ల అరుణ ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక మా మనస్సును రంజింప చేసినది

బొడబళ్ల వెంకటప్పారావు, కొత్తపట్నం

## సీరియల్స్

మీరు ప్రచురిస్తున్న నాలుగు సీరియల్ నవలలు బాగున్నాయి. వీటిలో పేర్కొనదగినది "కాగితపు పడవలు" నవల. అది దిగువ మధ్యతరగతి జీవితాలకు అద్దం పట్టినట్లుంది అందులోని సన్నివేశాలు చాలా సహజంగాను. అందులోని పాత్రలు చాలా సజీవంగాను ఉన్నాయి రచయిత్రి యర్రగుంట్ల వరలక్ష్మీదేవిగారికి మా ధన్యవాదాలు.

కె వరప్రసాద్, కె. భానుమతి, పార్వతీపురం.

● ● ●

4-1-85న మాధవి, చిరంజీవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్రవారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది. 'దేదీవ్య' సీరియల్ ముగింపు బాగుంది 'మౌనవిపంచి' సీరియల్ ఆసక్తికరంగా ఉంది

దామెర్ల రమాప్రభ, నెల్లూరు

● ● ●

సీరియల్స్ 'రాగసంధ్య', 'మౌన విపంచి' చాలా ఆసక్తికరంగా వున్నాయి ఈ సీరియల్స్ మా కుటుంబ సభ్యులంతా చదివి చాలా బావున్నాయి అంటున్నారు రచయితలకు మా ధన్యవాదాలు

ఎస్ అనసూయ. గణేష్. కళింగపట్నం




● ● ●

25-31-1-1985 నాటి సంచిక, "ముచ్చెర్ల అరుణ" ముఖ చిత్రముతో చాలా ఆకర్షణీయంగా ఉన్నది "మౌన విపంచి" సీరియల్ చాలా బాగుంది

"ఆరె పద్మజా చౌదరి" గారికి మా అభినందనలు

ఏ బాలాజి, ఏ. లక్ష్మి, హన్మకొండ

## కథలు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖ చిత్రం ముచ్చెర్ల అరుణ చాలా ఆకర్షణీయంగా వున్నది మనస్తత్వము, అందరూ ఆలోచించండి కథలు చాలా బాగున్నవి.

ఎస్ కె దుర్గామల్లేశ్వరరావు గుంటూరు

## ఆనందదాయకం

18-24 జనవరి 85వ సంచిక అనుకున్న దానికంటే ముందుగా మా చేతుల్లో వాలటం ఆనందదాయకం కొత్త సీరియల్ "రాగ సంధ్య" చాల బాగుంది.

యం మధు, హైదరాబాదు

## న్యూఢిల్లీ లేఖ

జనవరి 25-31వ తేది సంచికలో న్యూఢిల్లీ లేఖలో డా జయదుబాషిగారు విచిత్రమైన ఎన్నికలు శీర్షికలో ఇటీవల లోక్ సభకు జరిగిన ఎన్నికలు గురించి చాల చక్కగా వివరించారు

గంటా తవిటిరెడ్డి, బరంపురం ☐




**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938 - 1972)

శుక్రవారం 15-21 ఫిబ్రవరి, '85

శ్రీరక్తాక్షినామ సం మాఘ బ ఏకాదశి

సంపుటము 77 : సంచిక 24

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడిప్రతి వెల | రు 2-00 |
| ఆరు మాసాల చందా | రు. 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520,003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం

'ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి రామారావు

# మదరాసునించి మనకి సంక్రమించిన సంప్రదాయం

శ్రీమతి ఇందిరాగాంధీ హత్యతో ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు ఒక మలుపు తిరిగాయన్న భావం చాలామందికే కలిగింది. **లోకసభ ఎన్నికలలో పడిన వోట్ల** వివరాలు చూస్తే కాంగ్రెసు (ఐ) బలం చెప్పుకోతగినట్లుగానే పెరిగిందని కూడా తెలుస్తుంది. కాని కాంగ్రెసు (ఐ) బలం పెరుగుదల చాలకపోగా తెలుగు**దేశం బలం** కూడా పెరిగిందని ఎన్నికల ఫలితాలు **తెలిపాయి**. కొంతవరకు ప్రతిపక్షాలుగా పిలువబడే జనతా, భారతీయ జనతా, భారతీయ కమ్యూనిస్టు, భారతీయ మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీలు శ్రీ రామారావుని ఆశ్రయించటంవల్ల పోటీ ముఖ్యంగా ఇటు కాంగ్రెసు (ఐ) అటు తెలుగుదేశం పార్టీల మధ్య జరిగి చిన్న మెజారిటీలోనే తెలుగుదేశం గెలిచిందన్న వ్యాఖ్యలో నిజం ఉంది.



ఇప్పుడు శాసన సభ ఎన్నికలు రాబోతున్నాయి. శ్రీమతి ఇందిరాగాంధీ అస్తమించి నాలుగు నెలలు దాటిపోతోంది. కొందరు "సానుభూతి"గా వర్ణించేది అప్పటికి బాగా తగ్గినా వింతలేదు. జనతా, భారతీయ జనతా, భారతీయ కమ్యూనిస్టు భారతీయ మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీలు మళ్ళీ శ్రీ రామారావునే ఆశ్రయిస్తున్నాయి. అంటే మరొకసారి పోటీ తెలుగుదేశం, కాంగ్రెసు (ఐ) పార్టీల మధ్యనే జరుగుతుందన్నమాట.

ఈ సారికూడా తెలుగుదేశమే ఘనంగా గెలుస్తుందనటాని సందేహం ఏమిటి?

అధికారంలో ఎవరుఉన్నా వాళ్ళకి ఒక బలమయిన ప్రతిపక్షం ఉండటం మంచిది. తెలుగుదేశం పార్టీకి భా. జ. పా కాని, జనతాపార్టీకాని, కమ్యూనిస్టు పార్టీలు కాని ప్రతిపక్షాలు కావుకదా! (మిత్ర పక్షాలు అనే పేరు వాళ్ళకి వాళ్ళే పెట్టుకున్నట్లు తోస్తుంది) కాంగ్రెసు (ఐ) పార్టీవారి తీరుచూస్తే గెలుద్దామని గట్టిగా ప్రయత్నం చేసే సూచన సయితం కనపడటంలేదనే అనాలి!!

ఆంధ్రప్రదేశ్‌లోని సర్కారు, రాయలసీమ ప్రాంతాలు ఒకనాటి మదరాసు రాష్ట్రానికి చెందినవే. ఈ రాష్ట్రాన్ని ఒక మేధావుల నిలయంగా, రాజకీయ చైతన్యాలు బాగా అభివృద్ధి చెందినవారి ప్రాంతంగా వర్ణించేవారు. ఒకనాటి మదరాసు రాష్ట్రానికి వారసత్వం పుచ్చుకున్న నేటి తమిళనాడులో ఒక చలనచిత్ర నటుడు స్థాపించుకున్న రాజకీయ పక్షం ఎదురు లేకుండా ఏలుతోంది. ఈయన కొంత కాలంగా అమెరికా సంయుక్త రాష్ట్రాలలో తీవ్రమయిన అనారోగ్యంతో మంచానబడి మంచం మీద నుండే ఎన్నికలు గెలుచుకుని స్వదేశానికి తిరిగివచ్చి ముఖ్యమంత్రి పదవిని అలంకరిస్తున్నారు. ఆయనకి పూర్తిగా మాట వచ్చిందో రాలేదో తెలియటంలేదు. ముఖ్యమంత్రి బాధ్యతలని అటు ఉంచి ఒక మామూలు మనిషి జీవితాన్ని కొనసాగించగలరో లేదో కూడా తెలియటంలేదు. శ్రీ రామచంద్రన్ పార్టీ ఒకనాటి ద్రావిడ కళగమ్ నుంచి ఆవిర్భవించినదే. ద్రా. క. కీ, **అ.** ద్రా. **ము.**క.కీ మధ్య **ద్రా. ము. క. ఒకటి ఉంది. ఈ** కళగమ్ నాయకుడు శ్రీ **కరుణా**నిధితో పడక శ్రీ రామచంద్రన్ స్వంత పార్టీ పెట్టుకున్నారు. మదరాసులో ద్రావిడ సిద్ధాంతాలని ప్రచారంచేసే వారిని గద్దె ఎక్కించటానికి తోడ్పడినవారిలో ప్రథములు కీ. శే. చక్రవర్తి రాజగోపాలాచారి.ఒక వయిపు ఆయనా, మరొక వయిపు శ్రీమతి ఇందిరాగాంధీ కలిసి కీ. శే. కామరాజ నాడారు మీద ద్వేషంతో తమిళ ప్రాంతంలోని కాంగ్రెసు పార్టీని పనికట్టుకుని నాశనం చేశారు.

ఇప్పుడు తమిళనాడులో "కాంగ్రెసు" పేరు కల రాజకీయపక్షం అ. ద్రా. ము. క. (అంటే శ్రీ రామచంద్రన్) దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి కొనసాగుతోంది.

ఆంధ్రప్రదేశ్‌లో "స్వంతబలం" కల చివరి కాంగ్రెసు ముఖ్యమంత్రి శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డి. ఆయనని తీసివేసిన తరువాత తెలుగువారి రాష్ట్రంలో "కాంగ్రెసు" ప్రతిష్ఠ క్షీణిస్తూ వచ్చింది. 1977లో 1978లో, 1980లో గెలిచింది. వ్యక్తిగా శ్రీమతి ఇందిరాగాంధీ ఆమె విధించిన (తరువాత తొలగించిన) అత్యవసర పరిస్థితిలో జరిగిన అక్రమాలు సయితం ఆమె విజయానికి అడ్డురాలేదు.

1983లో ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసు (ఐ) పరిస్థితి బాగా లేదు. కాని అప్పటి శాసన సభ ఎన్నికలలో గెలిచింది, కాంగ్రెసు వ్యతిరేకత అనటంకన్నా చలన చిత్ర వ్యామోహం అనటమే సమంజసంగా ఉంటుంది. శ్రీమతి ఇందిరాగాంధీ విధానాల మీద ద్వేషాలు పెంచుకున్నవారు కొందరు తెలుగుదేశానికి వోటువేసి ఉండవచ్చు కాని మొత్తం మీద జనసామాన్యంలో సినిమా అభిమానమే బాగా పనిచేసింది.



మదరాసు నుంచి ఆంధ్రప్రదేశ్‌కి సంక్రమించిన వారసత్వాలలో ఇదే ప్రధానమయినదనవచ్చు. ఇక్కడ రాజకీయ చైతన్యాలు లేకపోలేదు కాని అవి చలనచిత్ర వ్యామోహంతో పోటీ పడలేక పోతున్నాయి. దానికితోడు కాంగ్రెసు (ఐ) పార్టీ వారిలో కృషి చేసి ఏమయినా సాధిద్దామన్న సంకల్పంకన్నా తేలికగా గెలవాలన్న అభిలాష బలపడటంతో తెలుగుదేశం 1983లో కన్నా 1985లో మరింత ఘనంగా గెలుస్తుందని ఎవరికయినా అనిపించి తీరుతుంది. పార్టీ అభిమానాలు, వ్యక్తిగత వ్యామోహాలు లేనివారికి ఈ పరిస్థితి కొంత విషాదకరంగా తోచటం సహజం. అయినాసరే ఎన్నికలలో పాలుగొని రాజకీయ పక్షాలతో నిమిత్తం లేకుండా సత్ప్రవర్తనకి పేరుపొందిన అభ్యర్థులని గెలిపించటంలో తప్పులేదు.

**– సూరి**

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# ఆర్థిక వ్యవస్థని అస్తవ్యస్తం చేస్తున్న అప్పు!

మీరు నాటిన విత్తనిబట్టే ఫలితం వుంటుంది 1980 నించీ శ్రీమతి గాంధీ నాటిన వాటి ఫలితాన్నే నేడు మనం అనుభవిస్తున్నాము

నన్నడిగితే అంతర్జాతీయ ద్రవ్యనిధి అప్పుతోనే అసలు ఈ కుళ్ళు ప్రారంభమైందంటాను శ్రీమతి గాంధీ ఊహ అయిన అది మన ఆర్థిక వ్యవస్థని, ప్రభుత్వాన్ని అన్నిరకాల అంతర్జాతీయ వంచకులకీ అందుబాటులోకి తీసుకువచ్చింది ఈ అప్పు తీసుకున్న తర్వాతే లండన్‌నుంచి స్వరాజ్‌పాల్ వచ్చి శ్రీమతి గాంధీ ఆర్థిక సామ్రాజ్యంలో తమ పాచికలని ప్రయోగించడం జరిగింది అయితే ఆయన మరీ ఎక్కువగా కబళించడానికి ప్రయత్నం చేసి ఉండకపోతే సఫలీకృతుడై ఉండేవాడేమో ఇప్పుడు ఉపరాష్ట్రపతిగా ఉన్న శ్రీ ఆర్ వెంకటరామన్ ఆనాడు పార్లమెంటులో అంతర్జాతీయ ద్రవ్యనిధి అప్పుని సమర్థించారు అబ్దుల్‌రహమాన్ అంతూలేని కూడా ఆయన అదే పార్లమెంటులో సమర్థించారన్న సంగతి మీకు గుర్తు ఉండే ఉంటుంది ఈ అప్పు విషయంలో మొదటినించీ నాకు అనుమానంగానే ఉంది ముఖ్యంగా మన ప్రజలకన్నా ఎక్కువగా ప్రపంచబాంక్, అంతర్జాతీయ ద్రవ్యనిధి ఈ అప్పు ఇవ్వడంపట్ల ఆసక్తిని చూపించడం నాకు మరింత అనుమానాన్ని కలిగించింది స్వరాజ్‌పాల్ వ్యవహారంలో కూడా నాకు మొదటినుంచీ సందేహంగానే ఉంది ఆయనని పార్లమెంటులోనూ, బయటాకూడా గట్టిగా సమర్థించిన వ్యక్తి ప్రణబ్‌ముఖర్జీ ప్రస్తుతం ఆయన తెరమరుగుకి వెళ్ళారు ఈ వ్యవహారంతో సంబంధం కల కొందరు ప్రవాసంలోకి వెళ్ళవచ్చున్న వార్తలు పత్రికలలో చూశాను ఆ కొందరిలో ప్రణబ్ ఒకరై ఉండి ఉంటారు

ముందుగా ప్రపంచబాంక్ విషయం వివరిస్తాను ఇది కూడా అన్ని బాంక్‌లలాగే డబ్బుని అప్పుగా ఇచ్చే వ్యాపారమే చేస్తున్నా దాంట్లో ఒక ప్రత్యేకత ఉంది ఈ బాంక్‌కి భారత ఆర్థిక విధానంలో కల ఆత్మవిశ్వాసం అనే అంశం నచ్చదు దానిని కూలగొట్టేందుకు ప్రపంచబాంక్ శాయశక్తులా ప్రయత్నిస్తూనే ఉంది అది తన మనుషులనుకున్నవారిని ఉన్నత స్థానాలలో ప్రతిష్ఠించింది ప్రధాన మంత్రి సచివాలయంలో కూడా ప్రపంచబాంక్ మనిషి ఒకరు ఉన్నారు ఒక ఆర్థిక వ్యవస్థని గోతిలోకి తోయాలంటే, అందులోనూ మనలాంటి బీదదేశంలో, సరైన మార్గం ఆ ప్రభుత్వానికి ఏటా అప్పులు ఇస్తూ ఉండటమే– పేదరైతుకి షావుకారు అప్పిచ్చినట్లు విదేశాలనించి అప్పు తీసుకోడం అన్నది తన కాళ్ళమీద తాను నిలబడగలనన్న ఆత్మవిశ్వాసానికి ఎంతమాత్రం సాటిరాదని ఇప్పటికి వందసార్లకి పైగా నిరూపించబడింది ఇతరుల నుంచి అప్పు తీసుకున్నవారికంటే సహాయం తీసుకోని వారే ఎంతో మెరుగుగా ఉండగలుగు తున్నారు అప్పుచెయ్యని ఆఫ్రికాదేశం ఒక్కటికూడాలేదు ఇప్పుడు ఆ ఖండం ఎంత దారుణమైన దుర్దశలో ఉన్నదో మీకు తెలుసు అక్కడి జనం ఈగల్లాగా చస్తున్నారు అయినా మరికొంత అప్పు ఇవ్వడం తప్ప ప్రపంచబాంక్‌గానీ, అంతర్జాతీయ ద్రవ్యనిధిగానీ వారికి ఏ సహాయమూ చెయ్యవు

ఎంతో అవసరం కలిగి శ్రీమతి గాంధీ ఆ అప్పుకోసం వెళ్ళలేదు బయటినించి దిగుమతులు చేసుకోడానికి డబ్బు కావాలి ఎక్కువగా ఎగుమతులు చేసే దేశం మాత్రమే అభివృద్ధి సాధిస్తుందన్నట్లు భారతదేశాన్ని చాలా తక్కువ ఎగుమతి చేస్తున్నందుకు ప్రపంచబాంక్ ఎప్పుడూ తక్కువగానే అంచనా వేస్తూనే ఉంది చైనా ఎగుమతులు ఆ దేశం ఉత్పత్తితో పోలిస్తే చాలా స్వల్పం అయినా చైనా ఆర్థిక వ్యవస్థ మనకన్నా మెరుగ్గానే ఉన్నది ఆ దేశంలో ఎవరూ తిండి తినకుండా నిద్రపోవడంలేదు కానీ ప్రపంచబాంక్‌కి ఆ విషయం అవసరం లేదు దాని అసలు యజమానులు ఎక్కడో ఉంటారు అంత పెద్ద వ్యాపారం వారి చెప్పుచేతలలో లేకుండా వెలుపల ఉండటం ఎలా జరుగుతున్నదో వారికి అర్థం కావడంలేదు ఆర్థిక వ్యవస్థని విదేశీ వ్యాపారంపై ఆధారపడేటట్లు చెయ్యడం వల్ల మనం పశ్చిమ దేశాలలోని దాని యాజమాన్యం అదుపాజ్ఞలకి లోబడి ఉండే పరిస్థితిని కల్పించినట్లే అవుతుంది

అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచబాంక్‌లతోపాటు విదేశీ నిపుణులనబడేవాళ్ళు, వారి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం, వాళ్ళ వ్యాపార సరళి మొదలైనవి కూడా దిగుమతి కావడం జరుగుతుంది వీళ్ళే అధికారంలో ఉన్న వారిపై తమ పలుకుబడిని ఉపయోగించి పి ఏ లనీ, పర్సనల్ సెక్రటరీలనీ, వాణిజ్యవేత్తలని, రాజకీయ వాదులనీ అభివృద్ధి పేరిట కొనేస్తారు మన పత్రికా రచయితలని, సంపాదకులని అవినీతికి ప్రోత్సహిస్తారు కార్యదర్శులనించి జవానువరకూ వాళ్ళు లంచాలు యిస్తారు ఏదో విధంగా మంత్రులకి కూడా వారు లంచం ఇస్తారు ఒకచోట విస్కీ సీసా ఇస్తే మరొకచోట పారిస్‌కి ఉచితంగా పర్యటన ఏర్పాట్లు చేస్తారు బేరం కుదిరితే కమీషన్‌లని స్విట్జర్‌లాండ్‌లోని రహస్య ఖాతాలకి జమచేస్తారు ఇక్కడిక్కడే చేతులు మారే ఏర్పాట్లు కూడా ఎన్నో ఉంటాయి వ్యాపారస్తులు ఉన్నట్లుండి ఒక్కసారిగా సంపన్నులుగా మారిపోయి భారతీయ కంపెనీలలో కోట్లుపెట్టి వాటాలు కొనగలుగుతున్నారంటే అది వారి చలవేమరి అవి వాళ్ళు ఏ విధంగా చేస్తారు? ప్రభుత్వం అలాంటి వారికి అనుకూలంగా ఉండేటట్లు న్యాయసూత్రాలని ఎందుకు సడలించాలి? విదేశాలలో ఉండే జాతీయ బాంకుల శాఖల ద్వారా ఇదంతా జరుగుతున్నది అవి ఆర్థిక మంత్రిత్వశాఖ అదుపులో ఉండి ఏజన్సీలలాగా పని చేస్తుంటాయి కాబట్టి లండన్, పారిస్‌లలో లక్షలాది డాలర్లు చేతులు మారే చక్కని ఈ చక్రవ్యూహానికి మూలకారణం అంతర్జాతీయ ద్రవ్యనిధి అప్పు ప్రొఫెసర్ షెనాయ్ అంచనాల ప్రకారం మనం బయటినించి తెచ్చిన అప్పు మొత్తంలో 40 శాతం నల్ల డబ్బుగా మారి అంతర్థానమైపోతున్నది భారతదేశంలో అవినీతిని విస్తరింపచేస్తున్న ప్రపంచబాంక్‌ని, అంతర్జాతీయ ద్రవ్యనిధిని

(66 వ పేజీ చూడండి)

# పాలు మాత్రమే తీసుకుంటున్న మీ పాప
# ఘన పదార్థాలకి సులభంగా మారేలా చూడండి...

## నెస్టమ్: సున్నితమైన మార్పు కోసం ప్రత్యేకంగా రూపొందించిన బేబీ సీరియల్

మీ పాపకి మీరు ఎంతో మంచి ఆహారం యివ్వాలనుకుంటారు. అందుకే మీరు పాపకి చనుపాలు యిస్తారు. మీరు యివ్వగలిగిన వాటిలో ఎంతో పోషకత్వం కలిగి, సులభంగా జీర్ణమయ్యే ఆహారం అదే.

పాపకి నాలుగు నెలలు నిండాక, పాపకి ఆహారంలో ఘన పదార్థాలు కావాలి. కాని పాప జీర్ణం చేసుకునే విధానం యింకా సున్నితంగా వుంటుంది. అందుకే పాపకి సులభంగా జీర్ణమయే సీరియల్ కావాలి. నెస్టమ్ వంటిది.

బియ్యంతో తయారు చేయబడినది కావడంతో నెస్టమ్ మొదటి ఘన పదార్థంగా సరియైనది పోషకాహార నిపుణులు సీరియల్‌లలో ఎంతో సులభంగా జీర్ణమయే దానిగా దీనిని అంగీకరిస్తారు

పాలతో కలిపి తయారు చేసినప్పుడు నెస్టమ్ పోషణ శక్తి విషయంలో పరిపూర్ణమైన ఆహారం. అత్యవసరమైన పోషక పదార్థాలన్నీ అందులో ఉంటాయి అందులోని విటమిన్‌లు మీ పాప చర్మానికి మెరుపు, కళ్ళకు కాంతి యిస్తాయి. పాప రోగ నిరోధక శక్తి పెరుగుతుంది. నెస్టమ్‌లో, ఆరోగ్యవంతమైన రక్తం కోసం ఇనుము, దృఢమైన ఎముకలు, పండ్ల కోసం కాల్షియం కూడా ఉన్నాయి.

పాలతో కలిపిన నెస్టమ్ బహు ఉపయోగకారి. ఉడకబెట్టిన పండ్లతోను, వండి, గుజ్జుగా చేసిన కూరగాయలతోను, పప్పులతోను కూడా కలిపి తినిపించవచ్చును

ఇక మీ డాక్టర్‌ని సంప్రదించి మీ పాపకి నెస్టమ్ ఇవ్వడం ప్రారంభించండి.

### ఉచితం!

మీ పాప తన ఆహారంలో మార్పుకి ఇష్టపడతాడు. కాబట్టి ఉచితంగా లభించే నెస్టమ్ వంటల ఫోల్డర్ కోసం వ్రాయండి!

నెస్టమ్
పోస్ట్ బాక్స్ నం. 6016 న్యూ ఢిల్లీ-110 008.






ఇనుము, విటమిన్‌లతో బలపరచబడింది

తయారు చేయడం సులభం



ముందుగా మరిగిన వెచ్చని పాలు పోయండి



నెస్టమ్ వేసి కలపండి



తినిపించడానికి తయారు

# నెస్టమ్®
## బేబీ సీరియల్
పాలతో కలపండి

NESTLÉ

SAA/FSL/N/3150 TELU

సీరియల్

# రాగసంధ్య

కాశీనాథుని సువర్చలా దేవి

(గత సంచిక తరువాయి)

ఉత్తరం ముగించిన గీతకు దుఃఖం ఆగలేదు. కాగితాలన్నీ మడిచి జాగ్రత్తగా కవరులో పెట్టింది. పెద్దగా ఏడవాలనుంది గీతకు. సుందరమ్మ లేస్తుందేమోనని భయం. పడుకున్న సుందరమ్మ మూడు గంటలకి లేచింది. గీత పడుకుని ఉంది. నిద్రపోతున్నదనుకుంది సుందరమ్మ. ఈమధ్య గీతకు సుందరమ్మ ఎదురుపడాలన్నా మాట్లాడాలన్నా చికాకుగానే ఉంది. సాధ్యమైనంత వరకు తప్పించుకొనే తిరుగుతున్నది. సుందరమ్మ మాత్రం తన ప్రయత్నం మానలేదు. మధ్యలో ఒకసారి శ్రీకాంత్‌ని కలుసుకున్నది. అతని చేత చివాట్లు కూడా తిన్నది. రాను రాను గీతను మూర్తికిస్తే బాగానే ఉంటుందా అనిపించ సాగిందావిడకు. మూర్తికిస్తే శ్రీకాంత్ గీతకి ఎన్నో రకాలుగా సహాయం చేస్తాడు. తన తోబుట్టువులా ఆదరిస్తానంటున్నాడు. అటువంటప్పుడు తనంతకంటే మంచి సంబంధం తేగలదా! అతను ఏ పరిస్థితుల్లోనూ గీతను చేసుకోడు. తన కోరిక తనకే హాస్యాస్పదంగా ఉన్నది. సంధ్య పూర్తిగా మాట్లాడటం మానేసింది. గీత కూడా ముభావంగానే ఉంటున్నది. ఇక తను ఎవరికోసం ఈ ప్రయత్నం. కనీసం శ్రీకాంత్ చెప్పిన విధంగా నడుచుకుంటే అతనిద్వారా గీత బాగానే సుఖపడవచ్చు. కాని, అతను సంధ్య తన పెళ్లాం కావాలని షరతుపెట్టాడే! ఇదెక్కడి విచిత్రం- అసలా మధుకేం రోగమొచ్చిందో తెలియదు. అంతా తారుమారైంది. ఈ కొరక రాని కొయ్య- శ్రీకాంత్‌ని పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకుంటుదా! మొండి ఘటం- చచ్చినా ఒప్పుకోదు. ఆ మూర్తి మాత్రం కనబడ్డాడా! చేసుకుంటానన్నాడా! పిచ్చి పెళ్లాన్నేసుకొని ఊరూరు తిరుగుతున్నాడు. ఈ పిచ్చిది వాణ్ణి తప్పు చేసుకోనంటుంది. ఇదంతా చూస్తుంటే తనకి పిచ్చెక్కేలా ఉంది. సుందరమ్మ దీర్ఘంగా నిట్టూర్చి లేచింది. కాసేపు ఆ పనీ, ఈ పనీ చేసేసరికి సంధ్య వచ్చింది. సుందరమ్మ సంధ్యను ఇన్నాళ్ళ తరువాత ఎందుకో పరకాయించి చూసింది. ముఖంలో కాంతి తగ్గింది. కళ్ళ కింద నల్లటి చారలు ఏర్పడుతున్నయి. రక్తం లేనట్టు ముఖమంతా పాలిపోయి ఉంది. జాకెట్టు చేతులు కూడా వదులుగా ఉన్నయి. అయ్యో! సంధ్య ఎంత చిక్కిపోయింది. ఎంతైనా కలిసి ఉన్న మమకారం. అక్క కూతురు. సంసారాన్ని ఇన్నేళ్ళుగా ఈడ్చుకొస్తున్నది. ఒక్కసారిగా సుందరమ్మకు ప్రేమ పొంగుకొచ్చింది.

**జరిగిన కథ–4 :** సంధ్య మధుతో జీవితం పంచుకోడానికి ఆమోదించింది. మధు, రమణి– శ్రీనివాసరావుగారి మొదటి భార్య సంతానం. రెండో భార్య సీతాలక్ష్మి. మధు స్నేహితుడు శ్రీకాంత్ అంటే సంధ్యకు తగని చిరాకు, అసహ్యం. సంధ్య పిన్ని కూతురు గీత. గీతను శ్రీకాంత్ కిచ్చి పెళ్లి చేస్తే బాగుంటుందని పిన్ని సుందరమ్మ ఆలోచన. మూర్తికి పెళ్లి అయిందని తెలుసుకొన్న గీత బాధ పడుతుంది. మధుకి నాగపూర్‌లో ఉద్యోగం వచ్చింది. మూర్తి తనభార్య పిచ్చిదని గీతతో చెప్తాడు. మధు చెల్లెలు భవిష్యత్తు బాగుకై మాధవిని పెళ్లి చేసుకోను నిశ్చయించుకున్నట్లు శ్రీకాంత్ చెపుతాడు. గీతను మూర్తి కిచ్చి పెళ్లి చెయ్యమని చెపుతాడు శ్రీకాంత్. మధునుంచి సంధ్యకు వచ్చిన ఉత్తరం గీత చదువుతుంది.

"ఏవే తల్లీ! ఇట్లా తయారయినావు? ఒక్కసారి నీ ముఖం అద్దంలో చూచుకో-" కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ అంది సుందరమ్మ. సంధ్య ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసుకుని చూడసాగింది. పడుకున్న గీత చటుక్కున లేచింది.

"అమ్మా, సంధ్యా! ఇట్లా దిగులుపడి జీవితాన్ని పాడు చేసుకోకే! మగవాళ్ళంతేనే అమ్మా! అవకాశవాదులు. వాళ్ళకి మొఖాన కొట్టినట్టు చెప్పాలిగాని, వాళ్ళ కోసం, నువ్వు తప్ప లోకం లేదన్నట్టుంటే లాభం లేదు." ధైర్యం చెప్తున్నట్టుగా అంది సుందరమ్మ.

సంధ్య ఆశ్చర్యంలోంచి తెప్పరిల్లి "ఇంతకీ నీకు కావాల్సిందేమిటి పిన్నీ- నేను ఉద్యోగం మానలేదే!"

సుందరమ్మ ఖంగు తిన్నది. సిగ్గు పడింది.

"ఎంత మాటన్నావే! నేను నీ మీద చూపించవలసినంత ప్రేమ చూపించక పోవచ్చు! కాని, నేనంత దుర్మార్గురాల్నిటే నువ్వెట్టా ఉన్నా ఉద్యోగం చేసి పోషించమంటానా! అందుకని నీ బాగోగులడిగానా!" సన్నగా రాగం పెట్టసాగింది సుందరమ్మ.

"లేదులే పిన్నీ- నాకే మనసు బాగాలేదు. నువ్వు బాధపడకు!"

"అదే వద్దంటున్నాను. మనసెందుకు బావుండకూడదు. కాస్త మనసుని సరిపెట్టుకొని శ్రీకాంత్‌ని పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకో-" నెమ్మదిగా అన్నా ఆ అనటంలో అధికారం, అభ్యర్థన రెండూ ధ్వనించాయి.

"అంటే నువ్వు గీతను మూర్తికిచ్చి చెయ్యటానికి ఒప్పుకుంటున్నావా!"

ఆత్రంగా అడిగింది సంధ్య.

గీత, తీర్పు వినటానికి సిద్ధంగా ఉన్న ముద్దాయిలా ఎదురు చూడసాగింది.

"దాని ముఖానికి అంతకంటే ఎవరొస్తారు? కోరి తెచ్చుకున్న దరిద్రం ఎవరైనా అనుభవించాలి. ఆ పిచ్చిదానితో, ఆ పిచ్చిదాని వెనకాల తిరిగే ఆ పిచ్చివాడితో ఇది సంసారం చేస్తుందిట. నా కడుపు తరుక్కుపోతున్నది. దీని బతుకిట్లా బండలవుతుందనుకోలేదు."

సుందరమ్మ శోకాలు ఎక్కువ కాసాగినయి.

"అమ్మా! నీకు పుణ్యముంటుంది, ఏడవకు. నేను పెళ్ళి చేసుకోను. నువ్వు అనవసరంగా రభస చెయ్యకు. నా పెళ్ళి మూలంగానే కదా శ్రీకాంత్ అక్కను చేసుకోవాలని షరతు పెట్టింది. నాకీ పెళ్ళి వద్దు. ఈ గోల నేను భరించలేను." చివాలున లేచి లోపలికెళ్ళింది గీత.

సుందరమ్మ తెల్లబోయి ఏడుపాపి వీధి బయట అరుగు మీదకు వెళ్ళింది. ఈ పాడు గోలలో పడి పురాణ కాలక్షేపం కూడా లేకుండా పోయింది. మర్నాటి నుంచి సుందరమ్మ పురాణానికి వెళ్ళాలని గట్టిగా నిర్ణయించుకుంది.

"గీతా! నా నిర్ణయానికీ నీ పెళ్లికి ఏం సంబంధం. ఈ షరతు మూర్తి పెట్టింది కాదుగా!" సంధ్య అడిగింది గీతను. సంధ్య వంట చేస్తున్నది. గీత కూర తరుగుతున్నది. అక్కడ సుందరమ్మ లేదని తొంగి చూచి తను నెమ్మదిగా అంది సంధ్యతో. "అక్కా! నేనొక మాటడుగుతాను. నువ్వు వింటావా!" ఏమిటన్నట్టు చూచింది సంధ్య.

"నువ్వు చేస్తానని ప్రమాణం చెయ్యాలి!"

"శ్రీకాంత్ భార్యనవుతాననా!" కంపరంగా అంది సంధ్య.

"ఛ అది కాదు"

"నేను చెయ్యగలిగిందైతే- అట్లాగే!"

"అయితే రాత్రికీ ఉత్తరం చదువు." రహస్యంగా పుస్తకంలో ఉన్న ఉత్తరం చూపించింది.

"మధు దగ్గర నుంచా! నేను చదవను- అనవసరం!"

"నువ్వు ఒట్టు వేశావు-" తప్పుదన్నట్టు అంది గీత.

సుందరమ్మను అరగంట బ్రతిమాలవలసి వచ్చింది భోజనానికి. మౌనంగా భోజనాలు పూర్తి చేశారు.

"మగ దిక్కు లేని కొంప. ఈ ఇద్దరు కొయ్యల్నీ పెట్టుకొని నేను ఈ మాయ

దారి సంసారం ఎట్లా చెయ్యాలిరా భగవంతుడా! నా తర్వాత ఈ ఆడ పిల్లలకి దిక్కెవరు? ఉద్ధరిస్తాడనుకున్న ఆ మహానుభావుడట్లా ముంచాడు. ఎన్నో ఆశలు పెట్టుకున్న ఈ పుణ్యాత్ముడు అలివిగాని షరతులు పెట్టాడు. మధ్యలో పిచ్చిదాని గోల-" అర్ధ రహితంగా ఏవేవో తనలో తనే గొణుక్కుంటూ నిద్రకుపక్రమించింది సుందరమ్మ.

ఉత్తరం చదవమని సంధ్యకు హెచ్చరించి గీత కూడా నిద్రపోయింది. చాలా సేపు సంధ్య చేతిలో ఆ కవరు పట్టుకుని చూస్తూ కూర్చున్నది. ఆమె మనసు నిండా రకరకాల ఆలోచనలు. ఇందులో మధు ఏం రాశాడో! అతని నిర్ణయం ఏమిటో! ఇన్నాళ్ళు తను ఇంకొకరిద్వారా వినటమే కాని సూటిగా అతని అభిప్రాయం తెలుసుకోలేదు. ఇది చదివితే తన గుండె ఆగిపోదుకదా! శ్రీకాంత్ చెప్పిందే నిజమా! మధు ఆ విషయమే వ్రాసి ఉంటాడా! లేక తన అదృష్టం పండ-తన ఇన్నాళ్ళ నుంచి పడుతున్న వేదనను పోగొడ్తూ- శ్రీకాంత్ మాటల్ని అబద్ధం చేస్తూ- అతను వస్తున్నాడా! తన జీవితంలో వసంతాలు పూయించటానికి అతనొస్తే ఎంత బాగుండును! సంధ్యకి ఉత్తరం తెరిచే సాహసం లేకపోయింది. చివరికెలాగో ధైర్యాన్ని కూడగట్టుకొని, వెయ్యి దేవుళ్ళకు మొక్కుకుంటూ ఉత్తరం తెరిచింది. ఆ ఉత్తరంలో ఆమెకు కనపడ్డ ఒకే ఒక వాక్యం- గుండెల్లో సమ్మెట పోటును గలిగించిన ఒకే ఒక వాక్యం- మాధవిని నేను చేసుకోక తప్పదు అన్న వాక్యం- చెవుల్లో సముద్రపు హోరులా ఆ వాక్యం హోరు పెట్టసాగింది. మధు ఎంత నిర్దయుడు! ఎంత దాక్షిణ్యరహితంగా తనను తన ప్రేమను తుడిచిపారవేశాడు. ఈ అగ్నిని భరించే శక్తి తనకు లేదు. తను ఎవరి నీడను చూచి కూడా అసహ్యించుకుంటుందో, ఎవరి పేరు విన్న మాత్రాన తనకు జుగుప్స కలుగుతుందో- అతని నీడలో తనను జీవించమంటున్నాడు. అతనితో జీవితం పంచుకోమంటున్నాడు.

ఈ విషయం మధుకి తెలియదా! తనకెందుకీ శిక్ష, గుండెలవిసిపోయేలా దిండులో తల దూర్చి ఏడవసాగింది సంధ్య. రాత్రి గంట మీద గంట గడిచిపోతున్నదే కాని ఆమెకు మాత్రం కంటి మీద నిద్ర రాలేదు. ఎంత ఆలోచించినా తెగని సమస్య! పరిష్కారం లేని సమస్య! తెల్లవారుతుండగా సంధ్యకొక ఆలోచన వచ్చింది. గీత, తెలిసో తెలియకో సుడిగుండంలాంటి జీవితంలో ఇరుక్కుపోవటానికి సిద్ధపడుతున్నది. భయంకరమైన ఆ వాతావరణానికి ఈ పసి మనసు తట్టుకోలేదు. శ్రీకాంత్ షరతుకి తను ఒప్పుకుంటే ఆర్థికంగా గీత జీవితం బాగుండవచ్చు! భార్య రోగానికి ఎంత ఖర్చు పెట్టగలడతను! అది తగ్గే రోగం కాదు. జీవితాంతం ఖర్చు పెట్టవలసిందే! తన త్యాగం వల్ల గీత ఒకరకంగా కొంత సుఖపడుతుందేమో! ఆ మాత్రం అవకాశం తను గీతకిస్తేనేం? శ్రీకాంత్ మీద కూడా పగ సాధించవచ్చు! అసలీ లోకం మీదే తనకు కక్ష! మగ జాతి మీదే తనకు పగ! ఈ పగ కోసమైనా ఈ పెళ్ళి తప్పదు!

అందరికీ ఒక రకంగా తెల్లవారితే సంధ్యకొక రకంగా తెల్లవారింది. ఆఫీసుకి వెళ్ళబోయే ముందు అంది సంధ్య. 'పిన్నీ! నేను... నేను ఈ పెళ్ళికి ఒప్పుకుంటున్నాను. గీతపెళ్ళి ఏర్పాట్లు ఘనంగా చెయ్యమను' సుందరమ్మ, గీత చాలాసేపు చైతన్య రహితంగా కూర్చుండిపోయారు.

* * * * *

దాదాపు నాలుగైదు నెలల తర్వాత యాదగిరి గుట్టవైపు రెండుకార్లు ఉత్సాహ నిరుత్సాహాల మధ్య ఊగులాడుతూ ప్రయాణం చేస్తున్నయి. ఒక కారులో సుందరమ్మ, మూర్తి, గీత, మూర్తి తల్లి, సంధ్య, సుందరమ్మ పక్కింటి రామాయమ్మ కూర్చున్నారు. ముందు కారులో శ్రీకాంత్ ఒక్కటే డ్రైవ్ చేస్తూ వస్తున్నాడు. ముందు సీట్లో కూర్చున్న సంధ్యకు కారు నడుపుతున్న శ్రీకాంత్ కనబడుతూనే ఉన్నాడు. మళ్లీ పెళ్లికి తయారైన తన బలహీనతకు, ఏమీ తెలియని రాధను మోసగిస్తున్నాననే బాధకు, మూర్తి మనసులో విచారపడు తున్నాడు. ఇట్లాంటివాడికి బంగారం లాంటి తన కూతుర్ని కట్టబెడుతున్నానే అని సుందరమ్మ మనసు మూగగా రోదించసాగింది. సంతోషంగా ఉన్నవాళ్లిద్దరే! మూర్తి తల్లి -కాబోయే కోడల్ని చూచుకుని మురిసిపోతున్నది. ఆ పిల్ల ఔదార్యానికి మెచ్చుకోకుండా వుండలేకుండా ఉన్నది. పొడుగాటి వాలు జడ. సొగదేరిన కళ్ళు. తెల్లటి శరీరఛాయ. మంచితనం ఉట్టిపడుతున్న గీత ఆమెకెంతైనా నచ్చింది. అంతేకాక ఆమెకు మిగిలిన ఒక్కగానొక్క కొడుకు మూర్తి. మూర్తి పసివాడుగా వుండగా తండ్రిపోయాడు. అప్పటినుంచీ గారాబంగా కళ్లల్లో పెట్టుకొని పెంచి ప్రయోజకుడ్ని చేసింది. ఎంతో సంబరంగా కొడుకు పెళ్లి జరిపించి, కొడుకు కోడలు అన్యోన్యంగా కాపురం చేసుకుంటుంటే చూడాలని కలలు కన్నది. తన కలలన్నీ కల్లలయినయి! కొడుకు జీవితం అంధకారమైంది. కొడు కళ్ళమని కొడుకుని పోరు పెట్టింది. వినలేదు. పాపం అ...



...ఉన్నాడు. ఎంతో ఆనందంగా ఉండవలసిన కొడుకు– జీవితంలో ఏ చిన్న సుఖాన్నీ నోచుకోకపోగా తీరని మనో వ్యధతో భార్యను తీసికొని తిరగని చోటు లేదన్నట్టు తిరిగాడు. ఎంత డబ్బు ఖర్చయిందో లెక్కలేదు. తన కొడుకెంత మారిపోయాడో కూడా తనకు తెలుసు. అతని ముఖంలో జీవకళ లేదు. పాతికేళ్ళకే అతనికి జీవితసత్యాలన్నీ తెలిసిపోయినట్టు విరక్తి పొందాడు. గీత ఎట్లా ప్రవేశించిందో కాని– తమ పాలిట అదృష్టదేవత. కాని, మూర్తి తను చేస్తున్న ఈ పనికిఎంత సిగ్గు పడుతున్నాడో ఆ తల్లికి తెలుసు. ఏదో రకంగా ఈ పెళ్ళయిపోయి తనకొడుకు జీవితం బాగుపడి సుఖపడితే చాలు. రాధ నెలాగో తను చూచుకుంటుంది. తన కొక వ్యర్థమైన కూతురుందనుకుంటుంది. ఈ రకంగా సాగిపోతున్నయి ఆవిడ ఆలోచనలు. గీత మనసు ఉరకలు వేస్తున్నది. మూర్తిని మనసారా ప్రేమించింది గీత. అతనికి అండగా నిలిచి అతనికి ధైర్యం చెప్పాలి;



ఇటీవల గుంటూరులో ఉషోదయ లలితకళా సమితి ద్వితీయ వార్షికోత్సవ సందర్భంగా కూచిపూడి నృత్య ప్రదర్శన చేస్తున్న కుమారి సి. వసంతలక్ష్మి.

# రాగసంధ్య

[illegible] అతనికి అర్ధాంగి కావాలి!. [illegible] రాయిలో కూర్చున్నది సంధ్య ఒక్కతే!

యింటు కార్లో వస్తున్న శ్రీకాంత్ ఆలోచించని ఆలోచన లేదు. తను అగాధంలో పడబోతున్నాడు. తనను నమ్ముకున్న తల్లి ఉంది. సంఘంలో తనొక ప్రత్యేక వ్యక్తి. తన అంతస్తు, హోదా అన్నీ ప్రతిక్షణం తనను ఆకాశానికి ఎత్తుతున్నయి. ఎంతో మంది పెద్ద పెద్ద వ్యాపారసంస్థలతో తనకు సంబంధం ఉన్నది. ఎంతమందో తమ కూతుళ్ళను చేసుకోమని బలవంతం చేశారు. తనతో విసిగిపోయి తల్లికి కబురు పంపారు. తమ దూరపు బంధువు వరసకు మేనమామ కూతురు మనోరమ దాదాపు సంవత్సరం తమ ఇంట్లో ఉండి ఏ రకంగానూ తనచేత ఆకర్షింపబడలేక తనని అసహ్యించుకుని వెళ్ళిపోయింది. ఎంతమంది తనచే ఆకర్షింపబడాలని చూచారు! వాళ్ళు ప్రయత్నిస్తున్న కొద్దీ తను బిగుసుకుపోయాడు! తనలో ఏ ఆలోచనుందో తనకే తెలియదు. తల్లి ఎన్నోరకాలుగా చెప్పిచూసింది. ఈ భోగభాగ్యాలన్నీ ఎవరి కోసం? మనిద్దరి కోసమే అయితే ఇంత ఇల్లెందుకు? రెండు కార్లెందుకు? ఈ వ్యాపారం ఎందుకు? అని ఏడ్చింది. చివరకు ఎవరైనా సరే నీ ఇష్టమొచ్చిన వాళ్ళని చేసుకుంటానను – ఈ ఇంట్లో పందిరి వేసే రోజు వస్తే చాలు. ఎన్నోరకాలుగా మొర బెట్టుకుంది. రంగ రంగ వైభవంగా తన పెళ్ళి ఆర్భాటంగా చేయించాలనుకున్నది. ఎన్నో కష్టాలు పడి తనను పైకి తీసుకొచ్చింది. శ్రీకాంత్ మనసు మూగగా రోదించసాగింది. కార్లు రెండు గుట్ట పైకి చేరుకున్నయి. మూర్తికి, గీతకు మంగళస్నానాలు చేయించారు. మూర్తి యాంత్రికంగా చేస్తున్నాడే గాని అతని మనసు మనసులో లేదు. పరుగెత్తుకు వెళ్ళి రాధ ఒడిలో వాలిపోయి 'రాధా, నన్ను క్షమించు–నేను కసాయివాడ్ని– నీకు అన్యాయం చేస్తున్నాను'–అని వేడుకోవాలనుంది. "మీకు రెండవసారి కావచ్చు – నాకు మొదటిసారేగా– నాకోసమైనా మీరు–" గీత నెమ్మదిగా ఎవరూ వినకుండా అన్న మాటలకు మూర్తి కొద్దిగా వాస్తవంలోకి వచ్చాడు. తను ఎదుర్కొనే కొత్త జీవితం ఈ మాటలతో ప్రారంభమైందని పించిందతనికి. మూర్తి తల్లి శాస్త్రప్రకారం అన్నీ చేయిస్తున్నది. సుందరమ్మ కూడా తాత్కాలికంగా అన్నీ మర్చిపోయి సంతోషంగానే ఉంది. ముఖ్యంగా మూర్తి తననుకున్నట్టుగా లేకుండా కూతురుకి ఈడు, జోడుగా అందంగా ఉన్నాడు. గీతముఖంలో సంతోషం సుందరమ్మకు తృప్తిగా అనిపించింది. అన్నమాట ప్రకారం శ్రీకాంత్ గీతకు ఎన్నోనగలు బహూకరించాడు. ముత్యాలు, పచ్చలు, రవ్వలు – అన్నీ సెట్లుగా తెరచి గీతకిస్తుంటే అందరి కళ్ళూ జిగేలు మన్నయి. నాలు గైదు రకాల పట్టు చీరలు కూడా గీతకోసం కొన్నాడు. మూర్తికి ప్రత్యేకంగా రవ్వల ఉంగరం చేతికి పెట్టాడు. ఇవేవీ ఊహించని మూర్తి అప్రతిభుడై నిల్చుండి పోయాడు.

"ఇవన్నీ ఏమిటి? గీతను నేను కావాలని చేసుకున్నాను. ఇవన్నీ ఆశించా! వద్దు, వద్దు, గీతా అవన్నీ మనకెందుకు?" మూర్తి మర్యాదగా తిరస్కరించాడు.

శ్రీకాంత్ నవ్వుతూ "ఇవే కాదు – ఇంకా మా గీతమ్మ కొక అపురూపమైనది ఇవ్వాలనుకున్నాను. మా గీత రేపటి నుంచి బెంగుళూరులోని మా ఎస్టేట్ ఆఫీసు మేనేజరుగారి భార్య. బెంగుళూరులోని మా ఇల్లు, కారు కూడా గీతకే చెందుతయి." అన్నాడు.

సుందరమ్మ ముఖం మీద కోటి బల్బులకాంతి. మూర్తి తల్లి కూడా ఆశ్చర్యంతో కూడిన ఆనందముతో మాట్లాడలేకుండా ఉన్నది.

మూర్తీ! మా ఫ్యాక్టరీలు, ఎస్టేటు వ్యవహారాలూ సమర్ధవంతంగా నడిపి మంచి లాభాలు తీసుకురా! నమ్మకమైన వాళ్ళు లేక నేను దాదాపు నెలకి ఇరవై రోజులు అక్కడే ఉండవలసి వస్తున్నది. నేను అక్కడ ఉండడం మూలంగా నాకు ఇక్కడి పనులన్నీ దెబ్బతింటున్నాయి. నేనేదో దయాధర్మంగా ఇస్తున్నానని కించపడకు. జీతం తీసుకుని పనిచేయి. నీకూ కాస్త స్థలం మార్పు వస్తుంది. నాకొక చెల్లెలుంటే ఈ వేడుకలు చేసుకోనా! నాకా అదృష్టం లేదు. అందుకని సరదాపడ్డానంతే–' నన్ను చిన్నబుచ్చకు!" అనునయంగా అన్నాడు శ్రీకాంత్. అతని మాటల్లో కొంత అధికారం కూడా తొంగి చూచినట్టనిపించిందందరికీ. అయినా అది మృదువుగా బాగానే ఉంది. ఎవ్వరూ అతని మాటలను వ్యతిరేకించలేకపోయారు. కూతురుకి పట్టబోతున్న అదృష్టానికి మురిసి-పోతున్నది సుందరమ్మ. మూర్తి తల్లి అపురూపంగా కోడలిని నగలతో అలంకరించ సాగింది. ఎఱ్ఱని జరీ పూల్ల బెనారసు చీరలో, నగలతో గీత దేదీప్య-మాన్యంగా వెలిగిపోతున్నది. మూర్తి కళ్ళు తిప్పుకోలేక పోతున్నాడు గీత మీదనుంచి. ఈ సందర్భంలో సంధ్యను పట్టించుకున్నవాళ్ళు లేరు. రాత్రికి






# రాగసంధ్య

ముహూర్తం కుదిరింది సంధ్యకు. ఆ పూట ఎవరు బ్రతిమాలినా సంధ్య భోజనం చెయ్యలేదు' నాలుగయిదుసార్లు గుడిలోకి వెళ్లి స్వామిని దర్శించి వచ్చింది అక్కడక్కడా తిరిగింది సుందరమ్మ సంధ్యను ఎక్కువగా బలవంతపెట్టలేదు మొదటికే మోసమొస్తుందేమోనని ఆవిడ భయం గీత సంధ్యను భోజనం చెయ్యమని రక రకాలుగా బ్రతిమాలింది సంధ్య ససేమిరా ఒప్పుకోదు సాదా తెల్ల వాయిల్ చీర కట్టుకున్నా సంధ్య అందం పరవళ్లు తొక్కుతున్నది ప్రయాణం మూలంగా రేగిన జుట్టు వింత అందాన్నిస్తుంటే- అలసటగా వాడిన కన్నులు ఆ అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి సంధ్య అందం ఏమందం! మగవాడి మనసుని పట్టి బందించే అందం! శ్రీకాంత్ హృదయంలో సన్నని రాగాలెన్నో పలుకుతున్నాయి ఆ అందం గాజుటద్దాలలో అమర్చుకుని చూసుకోవడానికే తప్ప అనుభవ యోగ్యం కాని అందం! శ్రీకాంత్ హృదయం బాధగా మూలిగింది సంధ్యా సమయం దాటి రాత్రి ప్రవేశించింది ముహూర్తం దగ్గరపడింది తెల్లని దోవతి లాల్చిలో శ్రీకాంత్ నిండుగా అదంగా ఉన్నాడు సూదిలాంటి- అతని ముక్కు పట్టుదలకు ప్రత్యేకంగా ఉంది కళ్లలోని ఆ తీక్షణతకి అందరూ తలవంచవలసిందే'చిరునవ్వులు చిందించే ఆ పెదవుల వెనుక ఎంత విషాదం దాగి ఉందో అతనికే తెలియదు ముహూర్తం సమీపిస్తున్నది స్వామి దర్శనం చేసుకు వస్తానని వెళ్లిన సంధ్య రాలేదు అందరూ ఆదుర్దాగా ఎదురుచూస్తున్నారు ఇంతవరకు స్నానం చెయ్యలేదు మంగళస్నానం చేయించమంటున్నాడు పురోహితుడు సుందరమ్మ తొక్కిస లాడుతున్నది గీత తను వెళ్లి చూచి వస్తానన్నది మూర్తి బయలు దేరాడు శ్రీకాంత్ నిర్లిప్తంగా అక్కడే ఒక స్థంబానికి ఆనుకుని నిల్చుని ఉన్నాడు చివరికి మూర్తి వెనకాలే వచ్చింది సంధ్య సంధ్యను చూచిన వాళ్లకు మతిపోయినట్లని-పించింది ప్రపంచంలోని నైరాశ్యమంతా కుప్పపోసినట్టుంది సంధ్య! ఈసంధ్యనా నేను పెళ్లి చేసుకోబోయేది' అనుకున్నాడు శ్రీకాంత్ తలంటు స్నానానికి సంధ్య ఒప్పుకోలేదు సరాసరి వచ్చి పీటలమీద కూర్చున్నది ఇట్లా కూర్చో కూడదని పురోహితుడు గోలపెట్టాడు సంధ్య మారు మాట్లాడలేదు సంధ్య ప్రక్కన కూర్చున్న శ్రీకాంత్ మనోభావాన్ని వర్ణించటానికి బాష చాలదు 'అతనికి ఒకటే బావన కలగసాగింది తనొక మహాగ్ని పక్కనున్నాడు అది తనను దహించి వేస్తుంది! తనకంటే దురదృష్టవంతులీ లోకంలో ఉండరు తనొక దౌర్భాగ్యపు జీవితానికి స్వాగతం పలుకుతున్నాడు ఆలోచనల మద్యే తాళిగట్టటమైంది ఆలోచనలుండటమే మంచిదైంది ఈ ఆలోచనా స్రవంతి లేకపోయినట్లయితే తానీ పని చేయగలిగే వాడుకాదు ఉలికిపాటుతో పక్కకి తిరిగి చూశాడు పచ్చని పసుపుతాడుతో సంధ్య! వద్దనుకున్నా బాగుంది చూడాలనిపించేట్టుగా తన మనసుని కవ్విస్తున్నది ఒకనాటి స్వప్నం! ఒకనాటి మధురోహ! ఒకనాటి సుకుమారమైన అనుభవం!మళ్లీ ఈనాడు ఎన్నాళ్ళకి తన కల ఫలించింది తన గుండెల్లో గూడు కట్టుకున్న సుందర స్వప్నం సంధ్య తన భార్య! ఆ అందాలరాశి తన బార్య! ఒకనాటి తన చిన్న అనుభూతి! తన కలల సజీవ స్వరూపం! తన బాగ స్వామిని! తన సమస్త రాజ్యానికి మహారాజ్ఞి!'తన హృదయరాణి! శ్రీకాంత్ మనసు క్రొత్త చివుర్లు తొడిగి మారాకు వేసి పుష్పించసాగింది అతని గుండెల నిండా సముద్రమంత ఆనందం! అతని కన్నులనిండా చంద్రుడంత వెన్నెల అతని శరీరంలోని అణువణువునా వసంతోదయం!మన్మదుడు ఎక్కుపెట్టి వదిలిన బాణం రివ్వున దూసుకుని అతని హృదయంలో నాటుకు పోయింది సంధ్య రూపం ఉన్నతమైన ఆమె వక్షస్థలం మీద పసిడి మాంగల్యాల మెరుపు అతని శరీరాన్ని మరింతగా మెరిపింపజేసింది తెల్లని అతని పలువరుస సంతోష సూచకంగా తళుక్కుమంది సంధ్య శాస్త్ర బద్ధంగా అతని అర్ధాంగి అయింది

(ఇంకా ఉంది)

# మండుటెండలో మంచుబొమ్మలు

'రఘ' సాయిరమేష్

ముద్దు ముచ్చట్లు ఎలా తీర్చుకోవాలో నేర్చుకుంది ఆ పూబోడి వెండీ పెళ్ళయిన రెండు మూడు నెలలకే. ఆ భారతీయుడి బలహీనత పూర్తిగా కనిపెట్టి బ్రతుకు బొంగరం తనకు నచ్చిన తీరులో త్రిప్పుకుంటూ

అడగగానే ఎంత డబ్బైనా ఖర్చు పెట్టి తన ముద్దుల మగువ మనసు మెప్పించటానికి షానెల్ సెంటు బుడ్లు దగ్గర నుంచి అతిఖరీదైన ఆఫ్రికన్ డైమండ్స్ వరకూ ఎన్నెన్నో కొనిపెడుతూ వైభోగాల్లో ముంచెత్తి మురిపాల యిల్లాలికి అరచేతిలో స్వర్గం సృష్టించిపెట్టారు శంకరరావుగారు

మూసిన గుప్పిటలో ఏముందో తెలుసుకోవాలని తాపత్రయ పడటంలో ఆశ్చర్యం వుండదేమో కాని,



విప్పిన గుప్పిలిలో గాలి తప్పించి ఏమీ లేదని తెలిసినప్పుడు ఆ మనిషికి కలిగే అనుభూతి, అవస్థ చెప్పలేనంత చిత్రంగా వుంటుంది మరి!

స్వేచ్ఛా జీవితంలో వెండీ నేర్చుకున్నది ఆ గుట్టు చప్పుడుకాని గుప్పిటి విద్య ఒక్కటే

ఆ మాటకి వస్తే ఆంగ్లేయ భామినులెందరో పుట్టుకలోంచి నేర్చుకునే అతి విలువైన విద్య అదొక్కటేనేమో?

ఆ చాతుర్యంతోనే ఎందరో శంకరరావుగారి లాంటి అమాయకుల్ని తమ అంద చందాలికీ, వినోద కాలక్షేపాలికీ బలిచేస్తున్నారు ఈ దొరసానులు, అని తెలియని అమాయక భారతీయులు పడమటి

దేశాల పైపై హంగులకీ ఆర్భాటాలకీ అరులు చాచటమన్నది శోచనీయమైన విషయమే మరి అత్యంత విలువైన భారతీయ సంస్కృతికీ, సంస్కా-రానికీ ఈ నవ నాగరికతా ప్రభావం ఓ గొడ్డలి పెట్టేమో?

శంకర్రావుగారిది స్వతహాగా భారతీయ తత్వం, ఓర్పు ఔదార్యం పెట్టి పుట్టిన మనిషే మరి కాని భారతీదేవి విషయంలో అంత తేలికగా ఎలా ప్రవర్తించ గలిగారో, వెండీ మోజులో అంత గాఢంగా ఎలా నాటుకో గలిగారో, అదంతా ఓ కనుకట్టులా అయిపోయింది

జీవితం అయోమయమే కావచ్చు, గాఢ నిద్రలోని గూఢ స్వప్నమే కావొచ్చు కాని మంచు తెరలు తొలగినప్పుడు మసక చీకట్లు మాయం కాక పోవు, మెలువ వచ్చినప్పుడు కల కరగకాపోదు

శంకరరావుగారు ఎప్పటిలా హాస్పిటల్‌కి వెళ్తున్నారు పూర్వంకంటే ఎక్కువగా ప్రైవేట్ ప్రాక్టీసు చేస్తున్నారు 'ఇదంతా ఎవరి కోసం' అన్న భ్రమ ఆయన మనసులో భ్రమించకపోలేదు?

సంపాదన మనిషికి సంజీవిని లాంటిది డబ్బు మీద విరక్తి ఏర్పడ్డ మనిషి మనిషి కాదు అతడో మహా ఋషి అయినా అవ్వాలి లేదా మతి చెడ్డ మనిషైనా అయి ఉండాలి శంకరరావుగారు యింకా ఆ రెండింటిలో ఏ స్థాయికీ చేరుకోలేదు మరి! చేరుకోటానికి వీలు లేకుండా మేనక, తిలోత్తమల్ని తలదన్నే ఆ దొరసాని భార్య వెండీ ఎప్పటి కప్పుడు తపో బంగం కలిగిస్తుంటే ఆయనకి మాత్రం రుచులు అభిరుచులు కలగకుండా వుంటాయా? విశ్వామిత్రుడికి పట్టిన అవస్థే శంకరరావుగారికి కూడా పట్టింది ఎక్కడో దూర తీరాల్లో ముక్కు మూసుకుని బ్రతుకుతున్నా వెన్ను పట్టి వదలకుండా!

మూడు నెలల తరువాత– ఓ రాత్రి– వళ్ళు కొరికే చలికి సుస్వాగతం పలుకుతున్న యింగ్లీషు వాతా-వరణానికి భయపడి, డబుల్ గ్లేజింగ్ కిటికీ అద్దాలు, యిన్సులేటెడ్ యింటి ద్వారాలు గట్టిగా బిగించి మూసి, వంట్లో వేడి చావకుండా వుండటానికి కల్తీలేని స్కాచ్ విస్కీ మెల్లగా పుచ్చుకుంటూ

## మంచుదిండల్లో మైనపు బొమ్మలు

కూర్చున్న వేళ –

డార్లింగ్ నాకు ఈ నర్స్ జాబు చేయటం చాలా నామోషికగా వుంది. నువ్వు ఏమంటే అనుకొని నీ అంత పెద్ద సైకియాట్రిస్టుకి ముద్దుల భార్యనై వుండి యింకా యిలా యూనిఫారమ్ వేసుకుని అందరిలా ఆర్డినరీగా బ్రతకడం ఏం బాగుంటుంది అయినా నీకుమాత్రం యిష్టమా చెప్పు స్వీట్ హార్ట్ ' అంది వెండీ చేరువకొచ్చి శంకరరావుగారి శిరోజాల్ని సున్నితంగా సవరిస్తూ

సో వాట్ అసహనంగా ఎదురు ప్రశ్న వేశారు పరధ్యాన్నంగా ఏదో ఆలోచిస్తున్న ఆ పెద్ద మనిషి

'మతిమరుపుతో పాటు నీకీ మధ్య తల తిక్క కూడా పుట్టిందనుకుంటాను "

తనలో తాను రోషంగా తిట్టుకుంటూ చివ్వునలేచి వెళ్ళి లాండ్ బార్ తెరిచి మరో గ్లాసుడు మాల్ట్ విస్కీ పోసుకొని గడగడా మ్రింగింది వెండీ, తీరని కోపం చల్లారటానికి ఓ రెండు అయిసుముక్కలు వేసుకుని

శంకరరావుగారు తనకేమీ పట్టనట్టు విక్టోరియన్ సోఫా చెయిర్‌లో వూయల లూగుతూ చేతిలో వున్న రిమోట్ కంట్రోల్ మీటనొక్కి టి వి పెట్టుకున్నారు.

'ప్లీజ్ వైడోంట్ యు లిజన్ టు మి మైలవ్ '

మళ్ళీ దగ్గరకి వచ్చింది ఆ భ్రమరి జేరాలాడుతూ

'ఏమన్నావ్ '

టి వి లో అప్పుడే ప్రారంభమైన పనోరమా ప్రోగ్రామ్‌లో డేవిడ్ డింబిల్ బీ అనే వ్యాఖ్యాత వివరిస్తున్న లోకాభిరామాయణాన్ని దీక్షగా తిలకిస్తున్న శంకరరావుగారు పరాకుగా ప్రశ్నిం-చారు

'వుడ్ యు మైండ్ ' అంటూ విసురుగా రిమోట్ కంట్రోలు అందుకుని టి వి ఆపుచేసింది వెండీ

'ఏమిటి వెండీ ఈ పెంకితనం మరీ పసిపిల్లలా అవతల దేశాలన్నీ ఎలా తగులపడిపోతున్నాయో చూశావా వైడోంట్ యురిసన్ కమాన్ డార్లింగ్ ఎట్‌లీస్ట్ లెట్ మి వాచ్ యిట్ " చిరాకు, సముదాయింపు మిళితమైన మాటలతో మృదువుగా మందలిస్తూ, మెల్లగా భార్య చేతిలోంచి రిమోట్ కంట్రోల్ లాక్కుని టి వి స్క్రీన్ మీద చిత్రాలు తెప్పించుకుని చూశారు శంకరరావుగారు ఆత్రంగా

"ముందు మన యింటి సంగతి చూడు తరువాత లోకాన్ని వుద్ధరించొచ్చు , అది ఎప్పుడూ ఎక్కడో వుండే గొడవే కదా " రుసరుసలాడింది వెండీ

"అదికాదు మైడియర్ అవతల రష్యన్స్ పోలెండ్‌లో చాలా గొడవలు తెస్తున్నారట లిసన్ కేర్ ఫుల్లీ సోలిడార్టీ లీడర్ లెక్‌వాలింసానీ అరెస్టు చేయించాడంట జనరల్ యారశాస్కీ యు నో –వాట్ దట్ మిన్స్ ?"

"సమ్‌తింగ్ బ్లడీహెల్ హు కేర్స్ "

'కమాన్ డార్లింగ్ డోంట్ బిసిల్లీ అవతల ఇరాన్ ఇరాక్ దేశాలు కొట్లాడుకు ఛస్తున్నాయి కాట్లకుక్కల్లా ఇవతల లెబనన్‌లో క్రిస్టియన్స్‌కీ ముస్లిమ్స్‌కీ మధ్య కీచులాటలు కిరాతకాలు యింకోప్రక్క పోలెండ్‌లో కమ్యూనిసమ్ కార్చిచ్చై దహిస్తోంది డెమాక్రసీని వేర్ డు వుయ్ గో నౌ ?"

'డోంట్ వర్రీ డార్లింగ్ వుయ్ కెన్ స్టిల్ లివ్ యిన్ యిండియా పీస్‌ఫుల్లీ కాంట్ వుయ్ ' ఫక్కరగబడి నవ్వింది విలాసిని వెండీ

ఆల్‌రైట్ ఆల్‌రైట్ "తప్పనిసరయ్యి ఓటమి నంగీకరించారు శంకరరావు గారు మరోసారి తన దొరసాని శ్రీమతికి శిరసు వంచి సెల్యూట్ పెడ్తూ

'ఇప్పుడు చెప్పు నీగొడవేమిటో " అన్నారు వెటకరిస్తూ

ఆ నీలవేణి నీలికళ్ళల్లో నిరసన నిలిచింది క్షణ-కాలం

"నాకీ వుద్యోగం చేయటం ఏమాత్రం యిష్టం లేదంటున్నాను

"ఐసీ ఏమిటో వున్నట్లుండి అంత విరక్తి ఆవుద్యోగం మీద "

"లిసన్ అయామ్ తింకింగ్ ఆఫ్ హేవింగ్ ఎఫేమిలీ " మనోహరి చెంపల్లో కెంపులు మెరిశాయి ఎప్పుడూ ఆడదానికి కలిగే ఓరకమైన బిడియ భావన ఆమె శృంగార నేత్రాల్లో దే బూచు





లాడింది. సగం నిండిన కుండలో తొణికిసలాడుతున్న నీళ్ళ పాలలా

యు మస్ట్ బి జోకింగ్ నమ్మలేక పోయారు శంకరరావుగారు

రియల్లీ ప్రామిస్ అంది వెండీ గోముగా, వాలు చూపులతో గేలం వేసి శంకిస్తున్న శంకరరావు గారి మనసును ఆకట్టుకుంటూ

ఆయన కళ్ళు విప్పారాయి ముఖం ప్రఫుల్లమయింది ఏదో తెలియని సంతాన వాత్సల్యం ఆయన నరనరాల్లో పొంగి పొరలింది

ఆర్ యు స్యూర్ అయినా నమ్మలేక రెట్టించారు శంకరరావు గారు

స్యూర్ డార్లింగ్ అయామ్ పోజిటివ్ చేతిలో చేయివేసి చెప్పినా నమ్మవా సంపూర్ణ యవ్వనం నింపిన సగటు బరువుతో, వదులైన లేత గులాబీ రంగు గౌనులో వాహ్యాళి చేస్తోన్న వన్నెల్ని ఎరపెట్టి కట్టుకున్న వాడ్ని కట్టి పాడేసింది వెండీ, నెరిసీ నెరవని ఆయన చెంపల్ని మరొక్కసారి మృదువుగా నిమురుతూ

అయ్యడు అయ్యడు " నోట్లో నోట్లో గొణుక్కున్నారు శంకరరావుగారు

ప్రియురాలి పరువం మనసుని మత్తెక్కిస్తుంటే, పట్టుతప్పుతున్న వూహల్ని పగ్గాలేసి ఆపలేక వున్నట్టుండి ఆ వయ్యారిభామని వాటేసుకుని వుక్కిరి బిక్కిరి అయ్యాడు ఆ పెద్ద మనిషి, పిచ్చి పిచ్చిగా ఆ పూబోణి ముఖాన్ని ముద్దులతో ముంచేసి పండగ చేసుకుంటూ

ఆర్ యు సేటిస్ఫైడ్ వెండీ చూపుల్లో ఏదో తెలియని ఆనందం చిందులు త్రొక్కింది

'ఇంత మంచి వుద్దేశం నీకు కలుగుతుందని ఎప్పుడూ అనుకోలేదు సుమా"

తేరుకోకుండా నోరుజారారు శంకరరావుగారు

'ఏ ఎందుకని పదునుగా వినవచ్చాయి వెండీ పలుకులు

అదే వెండీ పెళ్ళయ్యి ఆరు నెలలయినా కాలేదు ఇంతలోనే పిల్లల గురించి ఆలోచిస్తామని ఎవరు కలకంటారు చెప్పు "

సంభాషణని స్వకీయం చేయటానికి ప్రయత్నించారు శంకరరావుగారు

'డోంట్ బి సిల్లీ రావ్ ఆ వుద్దేశమే లేకపోతే నిన్ను పెళ్ళి ఎందుకు చేసుకుంటాను చెప్పు నీ యిష్టం నీకు ఎంతమంది పిల్లలు కావాలో చెప్పు అందర్నీ కంటాను నీ అంత తెలివిగా నా అంత తెల్లగా పుడితేచాలు అయ్ విల్ బి మోర్ దేన్ హేపీ " అంది భావయుక్తంగా

బిత్తర పోయారు శంకరరావుగారు ఆమె ఆంతర్యం అర్ధంకాక

"నీ కోసం ఏం చేయమన్నా చేస్తానని, నీకు బాగా తెలుసుగా"

## మంచుటెండలో మంచుబొమ్మలు

వెండీ మై డార్లింగ్

గుండెలు బరువెక్కించే గతం భారతీదేవి రూపంలో ఓ సారి కళ్ళ ముందు గిరగిరా తిరగటంతో ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి జరిగింది తలచుకుంటూ తపించలేక తనని తాను తమాయించుకోలేక సతమత మవుతూ చివరికి శ్రీమతి కౌగిలిలో శరణం, తీసుకున్నారు శంకరరావుగారు

వెండీకూడామారు మాట్లాడకుండా ముచ్చటగా యిమిడి పోయింది మగడి గుండెల్లో, మనసులో యింకేదో తలచుకుని మైమరచి పోతూ?

* * * *

నర్స్ వుద్యోగానికి రాజీనామా యిచ్చిన దగ్గర నుంచీ కాలక్షేపానికి ఎన్నెన్నో పనులు కల్పించుకోటం మొదలు పెట్టింది వెండీ ఎందరెందరో కొత్త స్నేహితుల్ని సృష్టించుకుంది యింటా బయటా ఆంధ్రుల కళ వుట్టిపడుతుండే భారతీ నిలయాన్ని తనకి నచ్చినట్టు తీర్చి దిద్దుకుని, కావలసినన్ని మార్పులు కూర్పులు చేయించి ఓ సుందరమైన యింగ్లీషు మేనర్ హౌస్‌గా మార్చేసింది వెండీ

తృళ్ళి పడుతున్న వయసుతో ఓ దొరసాని రాసి నివాళి యిస్తూ, కైపెక్కించే అందాలతో ఎప్పటి కప్పుడు కోరికలు తీరుస్తుంటే మనసుపడ్డ ఏ తెలుగు బిడ్డడు కాదని ఎదిరించి తన మనోహరి మనసు నొప్పించగలడు?

శంకరరావుగారు కూడా సుమారు అలాంటి అయోమయ పరిస్థితిలో నే చిక్కుకుని అవస్థపడ్డారు ఎందరో మగాళ్ళలా, యిల్లాలు బిగించిన శృంగార కళ్ళెంలో సుకుమారంగా యిరుక్కుని గ్రుడ్డిగా వురకలువేస్తూ!

పూర్వంలా ప్లాస్టిక్ తోరణాలు వ్రేలాడటంలేదు ఆ యింటి గుమ్మాలకి, వాటిస్థానే అతిఖరీదైన ఐ సి ఐ డ్యూలక్స్ రింగులు అలరారుతున్నాయి హరవిల్లులా

తెలుగుదేవుళ్ల అపూర్వ చిత్రాలకి బదులు ఏవేవో పిచ్చి పిచ్చి పెయింటింగ్‌లు అజంతా శిల్పాలకిబదులు అర్థంలేని యూరోపియన్ నగ్న శిలా విగ్రహాలు చోటు చేసుకున్నాయి ఆ యింటి గోడల నిండా, అయినా అభ్యంతరం చెప్పలేక పోయారు శంకరరావుగారు

మ్రొక్కుబడి కోసం దేవుళ్ల పటాల్ని మేకులు కొట్టి వ్రేలాడ దీయటం వెర్రితనమే నిజంగా మనసులో మహేశ్వరుడి రూపం నిలుపుకుంటే చాలదా అని సమర్ధించుకోటం తప్పించి ఆయన చేయగలిగింది ఏమీ లేకపోయింది

అందుకే గుండెల్లో గుర్తుగా నిలిచి పోయిన నీలకంఠుడ్ని మర్చిపోలేక, శుప్రభాతం వేళ నునివెచ్చని హీటర్ నీళ్లతో స్నానంచేసి, తూర్పు దిశ పెదుక్కుని ఓ దణ్ణం పెట్టుకోటం అలవాటు చేసుకున్నారు ఆ అయిదారు నెలలకో?

ఉంగరాలు మార్చుకుని వివాహం చేసుకున్నాక ఒకరినొకరు తీసిపారేసుకుంటే ఏం మర్యాదాగా వుంటుంది లోకానికి భయపడి మోకరిల్లాల్సిన అవసరం లేకపోయినా, ఇంగ్లీష్ సంఘం చేయెత్తి చూపుతుందేమో అన్న సంకోశం ఏ కోశానా లేకపోయినా, తన పరువు ప్రతిష్ఠలు దృష్టిలో పెట్టుకునైనా ఆలాసికని తను కాస్త లెక్క చెయ్యాలి గతంలో భారతి చూపించిన అనురాగం, ఒకరి మీద ఒకరికి చలిలో వెన్నలా పేరుకున్న అభిమానం, ఓ చిత్రానుభూతి మాత్రమే అనుకుని సర్దిపుచ్చుకోవాలంతే పరాయి దేశాల్లో వుంటూ పైగా పొరపడో త్వరపడో ఓ పరదేశస్థురాల్ని రెండో పెళ్ళాడి, యింకా సనాతన సాంప్రదాయాల్నే పట్టుకుని వ్రేలాడ్తానంటే ఎలా వీలవుతుంది? జీవితంలో మనిషికి ఏదీ శాశ్వతం కాదు, అలాంటప్పుడు కులమతతత్వాలు అచార ఆర్భాటాలు మాత్రం ఈ తనువుని శాశ్వతంగా అంటిపెట్టుకుని ఎందుకు వుండిపోవాలి?–

ఇదీ శంకరరావుగారి సహృదయం చూపించిన సమయస్ఫూర్తి!

పిచ్చివాళ్ళ బుర్రలు మరమ్మతు చేసే అంత పెద్ద వైద్యుడు కూడా ఆకొత్త పద్ధతులికి అలవాటు పడలేక ఎనలేని అలజడికి గురి అయిన మాట నిజమే కాని మానసిక వేదనకి మంచి మందేమిటో ఆ సైకి యాట్రిస్ట్‌కి బాగా తెలుసు అందుకే తనకేమీ పట్టనట్టు ప్రవర్తించటం మొదలు పెట్టాడు ఆ పెద్దమనిషి ప్రతీ విషయం పట్టించుకుంటేనే మనిషికి ఆవేదన, ఆవేశం కలుగుతాయి ఏమీ పట్టించుకోనివాడికి ఏ బాధా వుండదు ఎలాంటి అనుభూతీ మిగలదు అలా అని ఎందుకూ పనికి రాకుండా బ్రతకటంలోకూడా అర్థం వుండదు మరి అందుకే కాబోలు 'ఆనందాన్ని మాత్రం అందుకో సుఖాన్ని మాత్రమే సొంతం చేసుకో ' అన్న వేదాంతం వల్లించటం మొదలు పెట్టింది ఏదో తెలియని చిక్కుల్లోపడి సతమతమవుతోన్న శంకరరావుగారి మెత్తని మనసు'

భార్య ఎంత విచ్చలవిడిగా తిరుగుతున్నా కాని పని ఏదో చేస్తోంది అన్న అపనమ్మకం ఏర్పడ్డా పెద్దగా వాపోలేదు ఆయన 'కట్టి పారేయటానికి అదేమీ కుక్కపిల్ల కాదుగా పోతేపోనీ ఎవరి ఖర్మకి ఎవరు కర్తలు' అని సర్దిపుచ్చుకుంటూ వచ్చారు అన్నాళ్ళూ ఎనలేని శాంతం వహిస్తూ

కొన్నాళ్ళకి–ఓ రాత్రి–మార్గరెట్‌నీ, డేవిస్‌నీ విందు భోజనానికి ఆహ్వానించారు శంకరరావుగారు స్నేహపూర్వకంగా అతిథులు రాగానే ఖరీదైన షెర్రీ ముందు అందించి కూర్చోపెట్టారు ఎప్పటిలా ఆదరంగా ఆహ్వానిస్తూ, ఆంగ్లేయ మర్యాదలు పాటిస్తూ ఇంటికి ఎవరు వచ్చినా అగ్గగ్గలాడే భారతీదేవి ఆ క్షణం అక్కడ లేకపోవటంవలన వచ్చిన







లోపమేమిటో వెంటనే పసికట్టింధి మార్గరెట్ అరగంట దాటినా మేడ దిగి వెండీ క్రిందికి రాకపోవడంతో

"రావ్ నువ్వేమి అనుకోకపోతే ఓ విషయం చెప్తాను" అంది మార్గరెట్ ఆఖరికి వుండబట్టలేక

ఓ ష్యూర్ ప్లీజ్ గో ఎహెడ్ మేగీ' అన్నారు గంభీరంగా గ్లాసులో బ్రాందీ పోసుకుని హుందాగా ఆస్వాధిస్తూ

టానిక్ నీళ్ళు కలిసి కాస్త చప్పబడ్డ గోర్డన్స్ జిన్‌తో జిహ్వకి రుచి చూపిస్తున్నాడు డేవిస్ ఓ మూలగా కూర్చుని టి వి లో వస్తున్న మోర్‌కంబ్ అండ్ వైడ్ కామెడీ షో చూస్తూ

"నువ్వేమంటే అనుకుని ఈయింట్లో ఓవిధమైన వెలితి కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది " శంకరరావుగారు చకితులయ్యారు అనుకొని ప్రస్తావనకి

"యునో వాట్ అయ్ మీన్ ఎప్పుడూ నవ్వుతూ అందరినీ నవ్వించే మన భారతి లేకపోవటంతో ఈయిల్లు ఎంత చిన్నబోయిందో తెలుసా "

ఆయన నోట మాట రాలేదు, శరీరం కంపించింది ఏదో చెప్పలేని కంగారుతో, ఎండా కాలపు మేఘాలు వెనుగాలికి తాళలేక వేగంగా కదులుతూ వానకి బదులు పిడుగులు కురిపించినట్లు శంకరరావుగారి గుండె దడదడా కొట్టుకుంది వెల్లువలా విజృంభిస్తోన్న వూహలతో వుక్కిరిబిక్కిరి అవుతూ

"సారీ రావ్, గతం గుర్తు చేసి నీ మనసు నొప్పించినట్లున్నాను ." అంది మార్గరెట్ ఆయన అవతారం పసికట్టి

"నో మేగీ దట్సాల్‌రైట్ "అన్నారు శంకరరావు వివర్ణమైన ముఖాన్ని ఓ వింత నవ్వుతో ప్రఫుల్లం చేయటానికి ప్రయత్నిస్తూ

"భారతిలాంటి మంచి మనిషి మనకి దూరంకావటం విచారింపదగ్గ విషయం కాదంటావా చెప్పు "మార్గరెట్ అంతవరకూ ఎప్పుడూ అంత పెద్ద ఎత్తున ప్రసంగించలేదు. తమ యింటి విషయాల్లో, ఉన్నట్లుండి యిప్పుడు ఎందుకు అలా మాట్లాడుతుందో అర్థం కాలేదు ఆయనకి

"ఒకోసారి నాకూ అనిపిస్తుంటుంది సుమా భారతి విషయంలో మనందరం చాలా పొరపాటు చేశామేమో అని "

"డార్లింగ్ వుడ్ యు మైండ్ పాసింగ్ దట్ పీనట్ ట్రే టు మి ప్లీజ్ " డేవిస్ అడ్డుతగిలాడు వాళ్ళ సంభాషణ పట్టించుకోకుండా, మతెక్కించే మందు తగిలి తిమ్మిరెక్కుతోన్న నాలికకి వేరుశనగ పప్పులతో కాస్త తెలివి తెప్పిద్దామన్న ప్రయత్నంలో

"డోంట్ వర్రీ మేగీ నేను అందిస్తానులే నువ్వు కూర్చో ", అంటూ ట్రే తీసుకు వెళ్ళి డేవిస్ ముందు వుంచారు శంకరరావు

థేంక్స్ రావ్ ఈ స్నేక్స్ ఏమిటో కాని చాలా రుచిగా వున్నాయిసుమా అనాడు డేవిస్

"వుయ్ కాల్ యిట్ హాట్ మిక్స్చర్

ఐసీ దేఆర్ వెరీ టేస్టీ అయ్‌లైక్ దెమ్ " అంటూ మళ్ళీ టి వి సందడిలో మునిగిపోయాడు డేవిస్ వేరుశనగ పప్పులతో పాటు, కారంలేని యింగ్లాండ్ కారపు బూందీ కూడా కాస్త నోట్లో వేసుకుని నములుతూ

అప్పుడే అసలు విషయం నీకు తెలియజేసివుంటే యింత ఘోరం జరిగివుండేది కాదేమో అయ్ మస్ట్ కన్ఫెస్ ఈ దారుణానికి కొంతవరకూ నేనూ కారణమే మరి

మళ్ళీ మొదలుపెట్టింది మార్గరెట్

"అయ్ అండర్‌స్టేండ్ యువర్ ఫీలింగ్స్ మార్గరెట్ కాని ఏంచేయగలం చెప్పు .. అంతా జరిగిపోయాక "

అయ్‌నో రావ్ బట్‌స్టిల్ అయ్ ఫీల్ సోమచ్ గిల్టీ ఎబౌట్ యిట్ ఓవిధంగా భారతిని హత్య చేసినట్లే మనందరం " మార్గరెట్ కళ్ళు చెమ్మగిలాయి

"ప్లీజ్ మార్గరెట్ యిప్పుడు పశ్చాత్తాప పడి ప్రయోజనంలేదు భారతి అంత తలవంపులు తెచ్చే పనికి తలపెడ్తుందని నేను కలలో కూడా అనుకోలేదు మరి ఏం చేస్తాం ఆమెకి బగవంతుడు అలాంటి బుద్ధిపుట్టించాడంతే నో బడీ కుడ్ హెల్ప్ చురుకుగా చూసింది మార్గరెట్ మాటల్లో పెట్టలేని మందలింపుతో ఎరుపెక్కాయి ఆమెకళ్ళు

'షల్ అయ్ టాప్ అప్ యువర్ గ్లాస్ అంటూ మాట మార్చి ఆమె సమాధానంకోసం ఎదురు చూడకుండా చేతిలో గ్లాసు అందుకుని వెళ్ళారు బార్ వైపు, ముఖంచాటు చేసుకోటానికి

వోడ్కా లిమనేడ్‌లతో గ్లాసు నింపి, తెచ్చి యిచ్చారు రావ్ తాపీగా థేంక్స్ అయినా చెప్పకుండా క్రాస్ ఎక్జామినేషన్ ప్రారంభించింది మార్గరెట్.

'భారతికి బ్రదర్స్ వున్నారను కుంటాను .

'ఆహా

వాళ్ళకీ విషయాలు ఏమైనా తెలుసా '

"ఏవిషయాలు' శంకరరావుగారి ముఖంలో చిరాకు చిందులాడింది

"అదే రావ్ భారతి ఎలా చనిపోయిందో ఏమిటో వాళ్ళకి తెలియపరిస్తే మంచిదేమో " అంది మార్గరెట్ సందేహిస్తూ కాని విషయంలో కలగజేసుకుంటున్నానేమో అన్న కలవరపాటు ఆమె కళ్ళల్లో కొట్టవచ్చినట్లు కనిపించింది

అంతవరకూ ఓర్పుగా కూర్చున్న శంకరరావుగారు, కోపాన్ని యింకేమాత్రం ఆపుకోలేక పోయారు

"ఒకరికి తెలిస్తే వచ్చే లాభం ఏమిటంట " కళ్ళెగ్రజేశారు ఆయన మార్గరెట్ మౌనం వహించింది.

"అయ్ థింక్ వుయార్ డిస్కసింగ్ ఆల్ దిస్ అన్ నెసస్సరిలీ వాట్ డు యు సే" నిశితంగా చూశారు శంకరరావు, పదునైన మాటల్లో తన అభ్యంతరాన్ని తెలియజేయాలని ఆరాటపడుతూ.

"అయ్ నో రావ్ అయ్ హేవ్ నో రైట్ టు టాక్ ఎబౌట్ యువర్ ఎఫైర్స్ బట్ స్టిల్ భారతీ నేను ఎంత బెస్ట్ ఫ్రెండ్సమో నీకు తెలుసుగా . ఆ చనువుతోనే మాట్లాడుతున్నాను అంతేకాని నిన్నేదో నిలదీసి

# ఇవే మన పద్యాలు




వ్రాతకంటె హెచ్చు వరమీదు దైవంబు
చేతకంటె హెచ్చు వ్రాత లేదు
వ్రాత కజుడు కర్త చేతకు దాగర్త
విశ్వదాభిరామ వినురవేమ

అఘుగుదామనికాదు నీ మీద ఏదో పెద్ద నేరం మోపి నిరూపిద్దామని అంతకంటేకాదు యుసి నిజం దాచి మీ వాళ్ళందరినీ నమ్మించటం చాలా తప్పేమో అనిపిస్తోంది నాకు అయ్ డోంట్ నో వాట్ యు ఫీల్ ఎబౌట్ యిట్ తనని తాను శాంతపరుచుకుంటూ ప్రసంగం పొడిగించింది మార్గరెట్

నిజం చెప్పి ఎక్కడో సుఖంగా బ్రతుకుతున్న-వాళ్ళని లేనిపోని మనస్తాపానికి గురి చేస్తే నీకూ నాకు ఏం వరుగుతుంది డు యు లైక్ హుమిలియేటింగ్ పీపుల్ ఆర్ వాట్ పౌరుషంతో పళ్ళు కొరికారు శంకరరావుగారు మర్యాదకి ఓ చిరు

## మంచుదిండులో మంచు బొమ్మలు

మందహాసం ముఖం మీద తెచ్చిపెట్టుకుంటూ

మార్గరెట్‌కి మాటలు కరువయ్యాయి క్షణకాలం

అవకాశం వదులుకోకుండా ఎదురు ప్రసంగం ప్రారంభించారు శంకరరావు, గంభీరంగా

'చూడు మార్గరెట్ భారతితో నీ స్నేహం ఎంత సున్నితమైందో ఆమె అంటే నీకు ఎంత అభిమానమో, అనురాగమో నాకు బాగా తెలుసు - నువ్వు ప్రత్యేకంగా గుర్తు చేయవలసిన పనిలేదు - బట్ యు ఆర్ పర్ గెటింగ్ సమ్‌తింగ్ సుమారు యిరవై సంవత్సరాలు భారతి నాభార్యగా నా ఆరాధ్యదేవతగా చలామణి అయిన వ్యక్తి

ప్లీజ్ రిమెంబర్ దట్ మైడియర్ ఆమె గురించి నీకంటే నాకు బాగా తెలుస్తుందని వేరే చెప్పక్కర్లేదనుకుంటాను బిసైడ్స్ దట్ భారతి చనిపోవాలని నేనెప్పుడూ కోరలేదు ఆ కోరికే నాకుంటే యిన్నాళ్ళూ ఆమెతో సంసారం చేసి వుండేవాడ్నికాదు అయ్ ఎడోర్డ్ పెర్ ఆల్ మై లైప్ బట్ యు సి మేగీ లైఫ్ ఈజ్ నాట్ యిన్‌వేండ్స్ అది ఎక్కడో ఎవరూ చూడలేని చోట దాగుంటుంది దాన్ని పదిలంగా కాపాడుకోడం - జీవితాన్ని సుఖమయం చేసుకోటం అన్నది ఎవరికి వారు చూసుకోవల్సిందే ఎవరో వచ్చి వుద్ధ-రిస్తారని వూహించుకోటం శుద్ధ అవివేకం జీవితం మీద విరక్తి పుట్టిన మనిషికీ, బెంగపడ్డ మనసుకీ ఏదో మందు యిచ్చి వుత్తేజపరచటానికి ప్రయ-త్నించటం వృత్తి రీత్యా నేను చేసే పనే కావచ్చు కాని మనిషిని శాశ్వతంగా మభ్యపెట్టలేను పోయే ప్రాణాన్ని పగ్గాలేసి ఆపనూలేను యునో వాట్ అయ్ మీన్. అంతేకాదు బంధువైనా స్నేహితురాలైనా భార్యైనా సరే చాటుమాటుగా చావు కోరి తెచ్చుకునే మనుషులంటే నాకు వళ్ళుమంట ఆత్మహత్య చేసు-కున్న మనుషుల్ని మీద జాలి తలచటం నీకు చేతనైన పనేమో కాని నాకుమాత్రం ఆ పేరు చెప్తే పరమ రోత పుడుతుంది సో డోంట్ వర్రీ ఎబౌట్ మై బిలవ్డ్ వైఫ్ యు సి అయ్ విల్ ఎప్రిషియేట్ యువర్ కన్సర్న్ బట్ పర్ గాడ్ సేక్ డోంట్ షో టూమచ్ సింపతీ ఫర్ హెర్ అయ్ హేట్ దట్ ఏటిట్యూడ్

శంకర రావు గారు తుది పలుకుల్ని కాస్త బిగ్గరగా పలివ్వడంతో దూరంగా కూర్చుని టి వి చూస్తున్న డేవిస్ కాలక్షేప భగమయ్యింది

వాట్ డిడ్ యు సే అంటూ వాళ్ళవైపు చూశాడు డేవిస్ ఆసక్తిగా

నథింగ్ డార్లింగ్ యు ప్లీజ్ కేరీ ఆన్ భర్తని సముదాయించింది మార్గరెట్ మెల్లగా నవ్వుతూ

అయామ్ సారీ మేగీ అయ్ డోంట్ మీన్ టు బి రూడ్ క్షమార్పణ చెప్పుకున్నారు శంకరరావుగారు, కంఠంలో కాఠిన్యత కలిగించుకుంటూ

అయ్ నో యవర్ ఫీలింగ్స్ రావ్. ఏవేవో అడిగి నిన్ను విసిగించటం నావుద్దేశ్యం కూడా కాదు ప్లీజ్ ఫర్ గెట్ యిట్ ఛీర్స్ అంటూ గ్లాసులో అమృతం పైకెత్తి చూపించింది. మత్తులో మాధుర్యం చవిచూడమని పురికొలుపుతూ ఓ స్యూర్ అంటూ తనని తాను అదుపులో పెట్టుకుని "చీర్స్ అన్నారు శంకరరావు గ్లాసులు ఢీకొట్టించి గ్లాసుడు మత్తు గుండెల్లో దింపుకున్నారు, ఆదుర్దాగా నెపోలియన్ బ్రాందీ ఆస్వాదిస్తూ

(ఇంకా ఉంది)

# విజయ్

## భారతదేశపు నెంబర్ 1 ఐరన్
## 9 మోడల్స్‌లో లభిస్తుంది.































Jaisons/AMA/86/84

# వ్యక్తి గతం



భారత్- ఇంగ్లాండ్‌ల మధ్య జరిగిన సిరీస్‌లో కలకత్తా టెస్ట్‌లో తొలిసారిగా టెస్ట్ క్రికెట్‌లో ప్రవేశించిన మహమ్మద్ అజరుద్దీన్ వరుసగా మదరాసు, కాన్పూరులలో కూడా శతాధిక పరుగులు సాధించి ప్రపంచ రికార్డు నెలకొల్పాడు. హైదరా బాదుకి చెందిన 21 సంవత్సరాల ఈ యువకుడు ప్రదర్శించిన అద్భుతమైన ప్రతిభ ఇంగ్లాండు జట్టులోని క్రీడా-కారులని కూడా సంభ్రమాశ్చర్యా లలో ముంచెత్తింది. ఆదిలోనే క్రికెట్ ప్రపం చంలో అత్యున్నత స్థానాన్ని అందుకున్న అజ రుద్దీన్ క్రీడా నైపుణ్యాన్ని పాశ్చాత్య పత్రికలు కూడా ప్రశంసించాయి.... □



అర్జంటైనా అధ్యక్షుడు డా రాల్ రికార్డో ఆల్ఫోన్ సిన్ జనవరి 23న భారత దేశం వచ్చారు అణ్వస్త్ర నిషేధంపై అగ్ర రాజ్యాలకి పిలుపునిచ్చే ఆరు రాజ్యాల అధినాయక సమావేశంలో జనవరి 28న ఆయన ప్రసంగించారు అణ్వాయుధాల వల్ల కలిగే ఘోర పరిణామాలని నివారించేందుకు అణ్వస్త్ర రాజ్య పంచకం మన ఆశయాలతో ఏకీభవించాలన్న ఆశాభావాన్ని ఆయన వ్యక్తం చేశారు భారత్ అర్జంటైనాల మధ్య స్నేహ సహకారాల అభివృద్ధికి ప్రధాని రాజీవ్‌గాంధీతో ద్వైపాక్షిక చర్చలు జరిపారు ఆర్థిక, విజ్ఞాన శాస్త్ర, సాంకేతిక, సాంస్కృతిక రంగాలలో పరస్పర సహకారానికి మూడు ఒప్పందాలు జరిగాయి □

# వారఫలం

## 15-2-1985 శుక్రవారం మొదలు 21-2-1985 గురువారం వరకు

★ **మేషం:** ఏది ఏమయినా మీ పద్ధతి మారదు మీ లక్ష్యం చెదరదు ఒక్క ధనాదాయ మందు తప్ప వేరే విషయంమధైనా మీకు వెను చూపు లేదు వ్యాపార విస్తరణకు యత్నిస్తారు ఎంత-వరకు పలిస్తుందో వేచిచూడాలి స్త్రీలకు అన్ని విధాలా మేలైన వారమే ద్రవ్యలబ్ది

★ **వృషభం:** ఎవరేమనుకొన్నా, ఏ వ్యవ-హారంలో ఎంత ఆలస్యం జరిగినా వారమంతా మీకు సౌకర్యంగా ఉంటుంది వయోవృద్ధులు శారీరకంగా జాగ్రత్తపడాలి ఆహార విహారాదులందు జాగ్రత్త-పడాలి వృత్తియందు పెంపు స్త్రీలకు ద్రవ్యా-దాయం, ఉద్యోగ పెంపునకు అవకాశం గల వారం గ్రహించాలి

★ **మిధునం:** రాజకీయ రంగాన మీ ప్రయ-త్నాలు మెరుగైనవనే గ్రహిస్తారు బంధువులకో మిత్రులకో సాయపడవలసిన పరిస్థితులుంటాయి అధికార మందు వృద్ధిగాని, ఉద్యోగరీత్యా మార్పు-గాని, ఇల్లు మార్పు చేయటంగాని చెప్పదగిన అంశం స్త్రీలకు ధన విషయంలో, వ్యాపార విషయంలో మేలైనవారం

★ **కర్కాటకం:** స్థిరచరాస్తులందు పెంపు, వృత్తి యందబివృద్ధి, రాజకీయంగా మేలు మిత్ర సహాయ సంపత్తి, వ్యవహారం సత్ఫలదాయకం కావటం, గమనింపదగిన అంశాలు ప్రయాణ సమయంలో ఎంత జాగ్రత్త వహిస్తే అంత మేలు స్త్రీలకు కుటుంబానందం, శుభ కార్యప్రస్తావనలకు అవకాశమున్నది

★ **సింహం:** రాజకీయ వాదులకు, భారీ వాప్యారంచేసే వారికి, పత్రికా ప్రకటన కర్తలకు, ముద్రాపకులకు, పత్రికా విలేఖరులకు, సర్వాను-కూలం, కళా రంగాన ముఖ్యంగా నటనా విధాన మీ ప్రజ్ఞ రాణింపగలదు వారాంతాన వృధా కాలక్షేపం చేయగలరు, కాలం వ్యర్ధం చేయకండి స్త్రీలకు ఎంతో కాలంగా ఎదురు చూచిన 'ప్రమోషన్' లభ్యం కాగలదు

★ **కన్య:** కళా రంగాన మీ ప్రయత్నాలు ఫలిస్తాయి రాజకీయ రంగాన సత్ఫలితమే అందు-కొన్నారుగా' వృత్తియందు పెంపు కనిపిస్తుంది ఉద్యోగమందు మీ ప్రయత్నాలు సత్ఫలదాయకాలే స్త్రీలకు రచన, నటన సంగీతం ఉద్యోగమందు ప్రావీణ్యతగల వారికి సదవకాశాలు లభ్యం కాగలవని గ్రహించాలి

★ **తుల.** అదికార మందబివృద్ధిగలదు ఆత్మీయులు దాపునకు రాగలరు అప్రయత్న దనాదాయమున్నది అక్కరకురాని వారిని దాపునకు రానీయకండి ప్రజ్ఞావంతులే కాని సమయానికి అక్కరకు రానిది కాగల ప్రజ్ఞ, స్త్రీలకు ఉద్యోగ వృత్తులందు మేలు, ద్రవ్యాదాయం గల వారమే

★ **వృశ్చికం:** యత్న కార్యమందు మేలున్నది ఉద్యోగమందు అభివృద్ధి కారకమ్మైనవారం అప్పులు వసూలు కాగలవు, యత్నించండి మంచి ప్రతిష్ఠ లభ్యం కాగల సమయం నూతన వస్తువులు కొన-గలుగుతారు స్త్రీలకు వృత్తియందభివృద్ధి, ఉత్సాహ జనకమ్మైనవారం కళా రంగాన అభివృద్ధి-యున్నది, గ్రహించండి

★ **ధనుస్సు:** పదిమందిలో పేరు సంపా-దించగలరు వ్యవహారమందు విజయమున్నది నూతనోత్సాహం, నూతన వస్తువులు కొనగలుగు-తారు రాజకీయ మందు అధిక చొరవ ఏర్పడు-తుంది స్త్రీలకు వృత్తి యందభివృద్ధి, వ్యవహార విజయం చేకూరుతుంది, గ్రహించాలి బ్యాంకు ఉద్యోగస్థులకు పెంపు చేకూరుతుంది

★ **మకరం:** నూతన మిత్ర సంపర్కం, నూతన విధానాన ఆదాయం, ప్రతిభ రాణింపు, కళాసాహితీ రంగాన ద్రవ్యాదాయం చేకూరుతుంది వ్యవహారం ఏదయినా అపరిష్కృతం అయితే, ఈ వారం యత్నించండి, సఫలం కాగలదు స్త్రీలకు రాజకీయ, వైజ్ఞానిక రంగాన మేలున్నది, గ్రహించాలి

★ **కుంభం:** కథకులకు, గాయకులకు, న్యాయాధిపతులకు, రాజకీయ రంగాన ప్రజ్ఞ-వికసించగలదు ఆదాయం నాల్గు విధాలా చేకూర-గలదని గ్రహించాలి భూమి అమ్మటం కూడా చెప్పదగిన ముఖ్యాంశం స్త్రీలకు విద్యా రంగాన, వైజ్ఞానిక రంగాన మీకు లాభదాయకం

★ **మీనం:** ఎంతో కాలంగా వ్యాధితో బాధపడే-వారికి యికనుండి మేలు కలుగుట నిశ్చయం, పోయిన వస్తువుల భోగట్టా తెలిసికోగలరు విలువగల వాహనం కొందరు సాధించుకోగలరు స్త్రీలకు ఉద్యోగమో, వృత్తియందో పెంపు సాధ్యం, కొందరకు దూర ప్రాంతానికి ప్రయాణం కూడ నిశ్చ-యించుకోవటం జరుగుతుంది

–విద్వాన్ కొట సత్యరంగయ్యశాస్త్రి




రఘుపతి వరండాలో అడుగుపెట్టి, అక్కడి దృశ్యం చూసేసరికి ముఖం ఎర్రబడింది

రాజూ! గట్టిగా అరిచాడు

ఆ అరుపుకు భవనమంతా దద్దరిల్లి పోయింది కుర్చీలో కూర్చున్న రాజు రక్కున లేచి నిలబడ్డాడు అనుకోని ఈ భయంకరమైన అరుపుకు అక్కడే కూర్చున్న కొడుకులు, కూతురు అదిరి పడ్డారు

రాజు చేతులు కట్టుకొని నిలబడ్డాడు అతను ఆ యింట్లో డ్రైవరుగా పనిచేస్తున్నాడు

రఘుపతి ముందుకు వచ్చి రాజు కెదురుగా నిలబడ్డాడు అతని ముఖం వైపు సూటిగా చూస్తున్నాడు ఆ చూపులను తట్టుకోలేని రాజు తలదించేశాడు

ఏరా, ఈ యింటి అల్లుడివా నువ్వు? అడిగాడు రఘుపతి

రాజు కంగారు పడిపోతూ అయ్యగారూ! తప్పైపోయింది ఇంకెప్పుడూ అలా కుర్చీలో కూర్చోను అన్నాడు

అసలు నా పిల్లల ముందు, నా యింట్లో కుర్చీలో కూర్చోడానికి నీ కెన్ని గుండెల్రా! అడిగాడు

డాడీ కూతురు పిలిచింది

రఘుపతి వెను దిరిగాడు

ఏమిటి? అడిగాడు

మేమే అతనిని కూర్చోమన్నాము అంది

దాంతో మరింత ఆవేశం ముంచుకు వచ్చింది రఘుపతికి

మీరు కూర్చోమన్నారా? అసలు మీకు బుద్ధి వుందా! మీరెవర్రు? కోటీశ్వరుని పిల్లలు మీకో ప్రత్యేకత వుంది మీరు దర్జాగా బ్రతకాలి మన స్థాయి కంటే ఎక్కువ వున్న వారితోనే మనం మాట్లాడాలి వీడెవడు ఆఫ్టరాల్ డ్రైవరు వాడు వాడు పోడు మీ మధ్య కుర్చీలో కూర్చుంటాడా! అంటే, వాడు మన స్థితికి వస్తున్నాడా, మనం వాడి స్థితికి దిగజారుతున్నామా! ఏమైనాగానీ, ఒక వేళ మీరు కూర్చోమని చెబితే కూర్చోడమేనా! అని రాజువైపు తిరిగి, రాజూ ఇంకోసారి ఇటువంటి దృశ్యం కళ్లబడితే ఏం చేస్తానో నాకే తెలియదు అనేసి వెళ్ళిపోయాడు

రాజు తలపైకెత్తాడు

అతని కళ్లల్లో కన్నీళ్ళు

అవి చూసిన అక్కడున్న వారి హృదయాలు మూగబోయాయి

రాజూ, నాన్నది ఎదగని మనసు పాత కాలపు మనిషి మా వల్ల నువ్వు మాట పడవలసి వచ్చింది అంది రఘుపతి కూతురు పద్మ

రాజు కళ్ళు తుడుచుకుని లేదండమ్మగారు, అయ్యగారు చెప్పింది నిజమే నాదే తప్పు వస్తానమ్మగారు అనేసి వెళ్ళిపోయాడు

పద్మ స్థాణువులా అలాగే నిలబడిపోయింది

మంచి మనసు గల మనిషికి విలువ పడిపోతూ పైపై అడంబరాలు ప్రదర్శిస్తూ పెద్ద మనిషిగా చలామణీ అయ్యే మనిషికే విలువ పెరిగి పోతున్న ఈ రోజుల్లో రాబోయే రోజుల్లో ఈ దేశమేమై పోతుందో?

పద్మకి జవాబురాని ప్రశ్నలు ఉదయిస్తుండగా అన్నగార్లు పిలవడంతో వెళ్ళిపోయింది

*　　*　　*　　*

రోజులు వేగంగా గడచి పోతున్నాయి

రఘుపతి ఆస్తి పెంచుకుంటున్నాడు కొడుకులకి, కూతుళ్లకి పెళ్లిళ్ళు చేసేశాడు సంఘంలో తనకంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకొని, పెద్దమనిషిగా చలామణీ అవుతున్నాడు

రఘుపతి జీవితం వడ్డించిన విస్తరే! అయితే, ఆ విస్తరిలో ఏ క్షణాన ఏ దుష్టశక్తులు గరళాన్ని గుమ్మరిస్తాయో చెప్పడం కష్టం అది తెలియదు కాబట్టే జీవితానికో బలీయమైన నిర్వచనముంది జీవితానికే విలువ వుంది దానికో అందముంది

ఒక రోజు—

రఘుపతి క్లబ్ నుంచి వచ్చి వంట్లో స్థిమితం లేక మంచం మీద నడుం వాల్చాడు కాసేపు ఏదో తెలియని బాధ పడ్డాడు చివరికి కాళ్ళు చచ్చుబడిపోయాయి వెంటనే ఆసుపత్రికి తరలించారు ఉన్నవాడు తలచు కొంటే దేవుడే దిగివస్తాడు కాబట్టి, ఖరీదైన డాక్టర్లు ఖరీదైన మందులు ఎన్నో యెన్నెన్నో ఎందరొచ్చినా, ఏమి చేసినా రోగాన్ని తప్పించుకోలేని రఘుపతి అవిటి వాడే

అయ్యాడు డాక్టర్లు ఆసుపత్రిలో నే వుండమన్నారు

చుట్టాలు వస్తున్నారు

స్నేహితులు వస్తున్నారు

ఎందరో వస్తున్నారు పల్కరించి సానుభూతి కురిపించి మరింత దిగులు పెంచుతున్నారు

కొడుకులు ఎప్పుడో వస్తున్నారు చూసి అక్కడ వుండలేక వెళ్ళిపోతున్నారు

కూతుళ్ళు వచ్చి కన్నీరు పెట్టుకుని తమ ఆస్తుల పంపకము విషయమై లౌక్యంగా చెబుతున్నారు.

భార్య వస్తుంది ఏవో చెబుతుంది

"అబ్బా, వాసన" అని ముక్కు మూసుకుంటుంది

"ఎవర్రా అక్కడ" అని పిలుస్తుంది

ఎవడో వస్తాడు

'అబ్బ, ఈయన మల మూత్రాలు వెంట వెంటనే శుభ్రం చేయండయ్యా! ఛస్తున్నాము' అంటుంది.

ఇంతలో రాజు వచ్చాడు

"అమ్మగారూ! మన అయ్యగార్ని మనమే చూసుకోవాలి మీరలా అయ్యగారి యెదుట అంటే ఆయన మనసు బాధ పడుతుంది " నెమ్మదిగా అన్నాడు

రాజు వచ్చి రఘుపతి మూత్రం విసర్జించిన బెడ్‌షీటు, పంచె మార్చివేసాడు

అదీ రోజూ జరిగే తతంగం

జీవితంలో కష్టమనే పదమెరుగని రఘుపతికి ఒంటరిగా ఎన్నోసార్లు ఏడుస్తున్నాడు

ఎందుకంటే–

తనవారి నుంచి ఎంతో సానుభూతి ఆశించాడు కానీ, కన్న తండ్రిపై సానుభూతి కురిపించే తీరిక కొడుకులకిలేదు ఇక్కడే వుండి భర్త మంచి చెడ్డలు చూసే ఓపిక భార్యకిలేదు

రాజే వస్తాడు రాజే అన్నీ చేస్తాడు బయటి విషయాలు చెబుతాడు పేపరు చదివి వినిపిస్తాడు

రఘుపతిని ఆసుపత్రి నుంచి డిశ్చార్జి చేశారు ఇంటికి వచ్చాడు గడపదాటి అడుగువేస్తూ గొల్లుమన్నాడు ఎన్నో భయంకరమైన ఆలోచనలు అతన్ని

## అంతే తేడా!

వయసులో వున్న ఆడది
వయ్యారాలు పోతే
వృద్ధులు సైతం
వువ్విళ్ళూరుతారు!
వయసుడిగిన ఆడది
విన్యాసాలు చేస్తే
యువకులు సైతం
సన్యాసుల్లో కలుస్తారు!

–కె. శివకుమార్

## తోడు

భయపెడుతున్నాయి రాజు ముందుకు వంగి "అయ్యగారూ! మీరే బెంగ పడిపోతే అమ్మగారి సంగతెలాగో ఆలోచించారా అన్నాడు

అంత బాధలోనూ రఘుపతికి నవ్వు వచ్చింది

అయితే, ఆ నవ్వు వెనుక వున్న అంతరార్థాన్ని అతని కెదురుగా వున్న కుటుంబ సభ్యు లెవరికి అర్థం గాలేదు ఒక్క రాజుకే అర్థమైంది అతని హృదయము ద్రవించి పోయింది ఇక నుంచి అయ్యగారు పరాధీనమైన మనిషి పాపం ఏ పని చేయాలన్న మరో మనిషి అవసరం తప్పనిసరి! అనుకొన్నాడు

రెండ్రోజులు గడిచాయి

రఘుపతి కాస్త తేరుకొన్నాడు

బయటికి వెళ్ళాలని, నలుగురిలో తిరగాలని ఎన్నో కోరికలు తన పరిస్థితి గుర్తుకు వచ్చి నిరాశ కలుగుతోంది

ఇంతలో అటు వైపుగా వచ్చిన భార్యను చూసి, ఇదిగో, ఒంటరిగా బోరుగావుంది ఆ వీల్ చైర్లో కాసేపు తోటలో తిప్పుతావా! అడిగాడు

ఆమె బీరువా తెరిచి వేటికోసమో వెతుకుతూ, కాసేపాగండి అవతల మీనాక్షి వచ్చింది దానికి ఈ మధ్య కొన్న నెక్లెస్ చూపించలేదు అనేసి, తన క్కావలసినది తీసుకొని గదిదాటి వెళ్ళిపోయింది ఇంతలో వీల్ చైర్ తీసుకొస్తున్న రాజును చూసింది అతను రావడం రఘుపతి చూసాడు

'వస్తున్నావా రాజూ కాస్త అయ్యగారికి తోడుగా వుండు అస్తమానూ తిప్పమంటారు కాస్త ఓపిక వచ్చే వరకూ కనిపెట్టుకొని వుండండి అని హుకుంజారి చేసి హడావుడిగా వెళ్ళిపోయింది

రాజు వచ్చాడు

అయ్యగారూ!" అని పిలిచాడు

రఘుపతి పలకలేదు అయితే, రాజునే కన్నార్పకుండా చూస్తున్నాడు చేతులు రెండూ జోడించి చూస్తున్నాడు

రాజు ఆశ్చర్యపోతునాడు

"అయ్యగారూ!' నెమ్మదిగా బాధగా పిలిచాడు

రఘుపతికి దుఃఖం పెల్లుబికి వచ్చింది గొల్లుమన్నాడు

ఒరే, రాజూ! నువ్వు దేవుడివిరా! గతంలో నిన్ను ఎన్నోసార్లు, యెన్నో విధాలుగా అవమానించాను మా హోదాకు భంగం కలిగిస్తున్నావని తిట్టాను నీతో చనువుగా మాట్లాడ వద్దని పిల్లలకి చెప్పాను కానీ రాజూ, నువ్వే నాకు తోడుగా వుంటావని- నువ్వే నా పాలిట దేవుడివి అవుతావని అనుకోలేదురా! రాజూ నన్ను క్షమించవు నాకు తోడుగా వుండవు ఒరే, నువ్వు లేకపోతే ఈ మనుష్యుల మధ్య బ్రతకలేనురా!" అంటూ గొల్లుమన్నాడు మళ్ళీ

రాజు నిర్ఘాంతపోయాడు

"అయ్యగారూ! మీకేమీ ఫర్వాలేదు " అంటూ రఘుపతి కన్నీటిని తుడిచాడు రఘుపతి అతని వంకే చూడసాగాడు □



# మీ పళ్ల మీద చిగుళ్ల పట్టు సడలనివ్వకండి!

## కేవలం ఫోర్‌హెన్స్ మాత్రమే
## చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గివున్నది.
## చిగళ్లు గట్టిగా వుంటే
## పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి.










అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్.జె. ఫోర్‌హెన్ తాను తయారుచేసిన టూత్‌పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు.

1. ఇది నేరుగా చిగుళ్ల మీద పనిచేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము.
2. చిగుళ్లను బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.
3. ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం, దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.







## ఫోర్‌హెన్స్ — ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.

339F 234



# సినిమా విశేషాలు

—జి. వి. జి

## "ఇంటికో రుద్రమ్మ"లో ఇంటికొచ్చిన గంగమ్మ

గంగ (సుమలత)తో వచ్చిన విజయ్ (భాను-చందర్)ను చూసి శేఖర్ (రంగనాద్) దుర్గ (సుజాత) విస్తుపోయారు మమ్మల్నాశీర్వదించక్కయ్యా! అంటూ విజయ్ గంగతో పాటు ఇద్దరికీ నమస్కరించాడు

దుర్గ ఆశీర్వదించాక ఇదేమిటి ఇంత సడన్‌గా చెప్పా చెయ్యకుండా నాకో మరదల్ని తీసుకొచ్చావ్? అంది

పత్రికోడ్ని కదా – కొత్తగా న్యూసిచ్చి థ్రిల్ చేద్దామని అన్నాడు విజయ్

దుర్గ నవ్వుతూ మంచి పని చేశావు బాబూ! జీవితంలో ఒకసారి గంగని కాపాడటమే కాకుండా జీవితాంతం తోడుగా నిలబడే బాధ్యత తీసుకున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది అంది

శేఖర్ కూడా నవ్వుతూ గుట్టుగా పెళ్లి చేసుకున్నావు బాగానే ఉంది మాకు భోజనాలేవైనా పెడతావా – లేదా?" అన్నాడు

గంగ తల గోక్కుంటూ గదేందివయ్యా! యీడ వప్పున్నం పెడ్తారని తీసుకొస్తివి అంటూ విజయ్ బుగ్గమీద ఒక్క పోటు పొడిచింది విజయ్ వెళ్లి శేఖర్ మీద పడ్డాడు

అందరూ గొల్లున నవ్వారు

ఎస్ ఎ చంద్రశేఖర్ దర్శకత్వంలో నారాయణ రావు నిర్మించిన ధమయంతి ఆర్ట్స్ ప్రొడక్షన్స్ ఇంటికో రుద్రమ్మ చిత్రం త్వరలో విడుదలవుతుంది

## విశ్వ చిత్ర ప్రొడక్షన్స్ 3–డి చిత్రం

విరలాచార్యగారి దర్శక పర్యవేక్షణలో ఫిబ్రవరిలో ప్రారంభిస్తున్నాం అన్నారు జి వి ఆర్ రాజు ఈయన నిర్మించే 3–డి చిత్రానికి తెరవెనుక బి వి శ్రీనివాస్ చక్రవర్తి డబ్ల్యు ఆర్ చంద్ర వెంకటరత్నం నాగరాజన్ కపిల నాగేశ్వరరావు రాజు కృషి చేస్తారు



లవ్‌సీన్‌లో ఏడుపుమొహం పెడతా-వేమిటయ్యా?



సుజాత ఇంటికో రుద్రమ్మ లో



నేరస్తుడు లో మాధవి

# సరికొత్త సొగసైన రూపంలో పియర్స్!

Pears®
The original glycerine soap.

ఇప్పుడు పియ[illegible] సరికొత్త
ప్యాక్‌లో వస్తోంది. [illegible] సబ్బుని
తెలిపే రూపంలో. పియర్స్—అసలు సిసలైన గ్లిసరిన్ సబ్బు.
దీనిని మార్చాలని మీరూ అనుకోరు.
అలాగే మేమూను.

**పియర్స్ మీ చర్మాన్ని యవ్వనంగా,**
**సుకుమారంగా ఉంచుతుంది.**

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.




LINTAS PS 62 2720 TL

# సినిమా

## కె బాపయ్య దర్శకత్వంలో కృష్ణ, శోభన్‌బాబులతో "జయం మనదే"

నేటి సమకాలీన సమాజంలో జరిగే ముఖ్య సంఘటనల ఆధారంగా పరుచూరి సోదరులు రస వత్తరమైన స్క్రిప్ట్‌ను తయారు చేశారు ముందడుగు అనంతరం ఈ అగ్ర నాయకు లిద్దరూ నటించే నా దర్శకత్వంలో రూపొందే చిత్రం టీ వి ఎస్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ జయం మనదే అన్నారు కె బాపయ్య నిర్మాత డాక్టర్ డి వి ఎస్ రాజు నిర్మాణ సారధ్యంలో ప్రముఖ పారిశ్రామిక వేత్త టి వెంకట సుబ్బయ్య నిర్మించే ఈ భారీ చిత్రంలో జయప్రద శ్రీదేవి నాయికలు రావు గోపాలరావు నూతన్ ప్రసాద్ ప్రభాకరరెడ్డి గిరిబాబు ప్రభృత భారీ తారాగణం చక్రవర్తి సంగీతం వెంకట్ ఛాయ భాస్కరరాజు శిల్పం సలీం–సీను నృత్యాలు కోట గిరి వెంక టేశ్వరరావు కూర్పు వగైరా సాంకేతిక వర్గం



కళారంజని, శివకృష్ణ, "పులి పంజా

## ఎ ఎన్ ఆర్. తో నటుడు రాజా సమర్పించే చిత్రం

"హైదరాబాద్‌లో ఫిబ్రవరి 1 నుంచి 20 వరకు కేరళలో మార్చి 20 నుంచి 30 వరకు రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు వల్లభనేని జనార్ధన్ ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో యువ నటుడు రాజా సమర్పించే ఎల్ వి ఆర్ ఎంటర్ ప్రైసెస్ వారి చిత్రానికి జనవరి 5 న పాటల రికార్డింగ్‌తో ప్రారం భోత్సవం జరిగింది ఎ ఎన్ ఆర్ సుజాత గుమ్మడి గొల్లపూడి అల్లు రామ లింగయ్య రమాప్రభ అనూరాధ రాజా పాత్ర దారులు రాజా సరసన స్వాతి అనే నవ నాయిక పాల్గొంటుంది గోపీ మాటలు చక్రవర్తి స్వర కల్పనలో గీతాలు రాశారు నవకాంత్ ఛాయా గ్రాహకుడు బాలు శిల్పం కె సత్యం కూర్పుతో చామర్తి వెంకట లక్ష్మి నర్సమ్మ నడివల్లి పద్మ సుంకవల్లి వెంకటలక్ష్మి నిర్మాతలు ఎస్ వి నరసింహారావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్

"శ్రీవారి శోభనం"లో నరేష్, అనితారెడ్డి

## సినిమా



"అనగనగా ఒక ఇల్లు"లో ఒక దృశ్యం

### చిరంజీవి, కోదండ రామిరెడ్డి, యండమూరి కాంబినేషన్‌లో "అందమైన అనుభవం

నృత్య సంగీత ప్రాధాన్యం గల కుటుంబ గాధా చిత్రం ప్రముఖ కదక్ నాట్యాచార్యుడు గోపీకృష్ణ ఈ చిత్రానికి నృత్య దర్శకత్వం వహించడం మరో విశేషం హెలి కాప్టర్ ఫైట్స్ బోట్ చేసింగ్‌ల లాంటి రిస్క్‌తో కూడిన థ్రిల్స్ ఎన్నో ఉంటాయి ఉగాది నాడు పాటల రికార్డింగ్‌తో ప్రారం బోత్సవం జరుగుతుంది. అన్నారు ఎ కోదండరామిరెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎ శారద నిర్మించే శారదా చిత్రా లయ వారిపై చిత్రంలో చిరంజీవి, భాను ప్రియ, స్మిత ఆదిగాగల వారు పాల్గొంటారు యండమూరి వీరేంద్రనాద్ కదకు సత్యానంద్ సంభాషణల కర్త వేటూరి గీతాలకు ఇళయరాజా స్వరకర్త లోకసింగ్ చాయా గ్రాహకుడు

### పి. ఎస్. ఆర్. పిక్చర్స్ "ముద్దుల మావయ్య" 3–డి చిత్రం

లక్ష్మీకాంత్– ప్యారేలాల్, పి దేవరాజ్ పేరాల ప్రభృత సాంకేతిక వర్గంతో పై 3–డి చిత్ర నిర్మాణానికి సన్నాహాలు చేస్తున్నట్లు నిర్మాత పింజల సుబ్బారావు తెలిపారు



నరశింహరాజు- రాజేశ్వరి డేంజర్‌లైట్

## సినిమా

నిర్మల అన్నపూర్ణ పాల్గొంటున్నారు గుహనాథన్ కథకు సత్యానంద్ సంభాషణల కర్త చక్రవర్తి సంగీతం వెంకట్ ఛాయ సాయికుమార్ శిల్పం సలీం నృత్యాలు వెంకటరత్నం కూర్పు. కె ఎల్ ఎన్ శాస్త్రి నిర్వహణతో మే 31న హీరో కృష్ణ జన్మదినోత్సవ సందర్భాన విడుదలవుతుంది

### శ్రీ సారథి స్టూడియోస్ చిత్రం

సంపూర్ణ హాస్య ప్రదాన చిత్రం పాఠకులను విశేషంగా ఆకర్షించిన ఒక నవల ఆధారం మే జూన్ నెలల్లో మొత్తం షూటింగ్ పూర్తయి పోతుంది

అన్నారు పి శశిభూషణ్ ఈయన నిర్మించే పై సంస్థ తాజా చిత్రంలో మురళి హీరో గొల్లపూడి ఓ

విలక్షణమైన పాత్రను నిర్వహిస్తారు గోపాల రెడ్డి ఛాయా గ్రాహకుడు గౌతంరాజు సంకలనకర్త రచన దర్శకత్వం జంధ్యాల అనంతరం సెప్టెంబర్ అక్టోబర్ మాసాల్లో మరో చిత్రాన్ని ప్లాన్ చేసినట్లు పి శశిభూషణ్ చెప్పారు

"ఈ పోరాటం మార్పుకోసం"లో ప్రభ, విక్రమ్‌షా



### "శ్రీ వెంకటేశ్వర తులాభారం 3–డి చిత్రం

కలియుగదైవం శ్రీ వెంకటేశ్వరస్వామి లీలలను ప్రేక్షకుల కళ్ళెదుట జరిగేలా భ్రమ కలిగించే రీతిలో 3–డి లో తీస్తున్నాం ఫిబ్రవరి 8 నుంచి 28 వరకు–

మార్చి 15 నుంచి ఏప్రిల్ 4 వరకు షెడ్యూల్స్ ప్లాన్ చేశాం అన్నారు శివదత్త ఈయన రచన దర్శకత్వంలో కె రామకృష్ణారావు రావి మోహనరావు జి వెంకట విరల్ నిర్మించే పై చిత్రానికి కమలాకర

కామేశ్వరరావు దర్శక పర్యవేక్షణ జరుపుతారు రాజన్ – నాగేంద్ర సంగీతం అశోక్‌కుమార్ ఛాయ శేషు నృత్యాలు పి శ్రీనివాస్ మతి ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు

### కృష్ణ, శ్రీదేవి జంటతో తాతినేని రామారావు దర్శకత్వంలో మిద్దే రామారావు చిత్రం

నేను డైరెక్టు చేసిన మంచి మిత్రులు లో కృష్ణ శోభన్‌బాబు హీరోలు చాలా కాలానికి కృష్ణ నేను కలిసి ఈ చిత్రానికి పనిచేస్తున్నాము ఓ విధంగా చెప్పాలంటే కృష్ణ సోలో హీరోగా నేను డైరెక్ట్ చేసే ఫస్ట్ పిక్చర్ ఇది అన్నారు తాతినేని రామారావు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో మిద్దే రామారావు నిర్మించే శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ 9వ చిత్రంలో జగ్గయ్య రావుగోపాలరావు గొల్లపూడి మారుతీ రావు నూతన్‌ప్రసాద్ రాజేంద్రప్రసాద్ వేలు

## "సుమన్"లో రకరకాల చోరులు

సుమన్‌ను చూసి కో కో (మారుతీరావు) ఓ చోర శిఖామణీ! వెల్‌కమ్! అన్నాడు

అధిక ప్రసంగం చెయ్యకు నేను దొంగనేకాను అన్నాడు సుమన్

బలే జోకు వేశావయ్యా! వికటంగా నవ్వుతూ కో కో అన్నాడిలా ఆ మాటకొస్తే ఎవరు దొంగలు? దోచుకునే వాణ్ని దొంగా - అంటారు అవునా? అలనాడు శ్రీకృష్ణ భగవానుడు పదహారువేల మంది గోపికల హృదయాల్ని దోచుకుంటే కవులు అతన్ని గోపికా మానస చోర అని వర్ణించారు ఇక ప్రజల వైపు కొద్దాం ప్రజల్ని దోచుకునేవాణ్ని ఈనాడు రాజకీయ నాయకుడు - అంటున్నారు సొసైటీని దోచుకునే వాళ్లని సంఘ సంస్కర్తా - అని ముద్దు పేరు పెట్టి పిలుచుకుంటున్నారు కాని మనల్ని మాత్రం దొంగ వెధవలనుకుంటున్నారు ఈ దౌర్భ న్యాన్ని మనం సహించకూడదు బాంకులు దోచుకునే వాళ్ళని బేంకు చోరా అని పిలవండి ప్రజల్ని దోచుకునే వాణ్ని ప్రజాచోరా అని పిలవండి ఇల్లు దోచుకునేవాణ్ని ఇళ్ళ చోరా అని పిలవండి ప్రాణాలు దోచుకునే వాణ్ని ప్రాణచోరా అని పిలవండి దొంగల మహాసభను పెట్టి ఒక రూలింగ్ పార్టీ ఏర్పాటు చేస్తే పార్లమెంటులో మనకు కొన్ని సీట్లయినా దక్కుతాయి నీలాంటి వాడికి నాయకుడయ్యే అవకాశం దక్కుతుంది ఏమంటావ్?

ఇంకోసారి ఖచ్చితంగా చెబుతున్నాను నేను దొంగని కాను దోచుకునే వాళ్ళనే దోచుకుంటాను అంతే అన్నాడు సుమన్

అప్పుడు నిన్ను చోర చోరా అంటారు తెలుగులో చేప్పాలంటే దొంగలకి దొంగా అని

నువ్వు దోచుకుంటున్నంత కాలం నేను నిన్ను దోచుకుంటూనే ఉంటాను అన్నాడు సుమన్

కో కో బిత్తరపోయాడు

ప్రసాదరావు కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో గాలి వెంకట్రావు ఆట్లూరి సీతారామారావు నిర్మించే జి ఎ ఆర్ ప్రొడక్షన్స్ సుమన్ చిత్రం విడుదలకు సిద్ధంగా ఉంది □



కృష్ణమోహన్, లక్ష్మీ చిత్ర ప్రేమ పంజరం లో

# 50,00,00,000 గ్లాసుల మధుర పానీయపు మజా

రసనా భారతదేశంలో అత్యధికంగా అమ్ముడుపోతున్న సాఫ్ట్ డ్రింక్ కాంసెంట్రేట్. కేవలం గత సంవత్సరంలోనే 50 కోట్ల గ్లాసుల రసనా మధుర పానీయం అందరూ మజా-మజాగా త్రాగారు.

**<u>తయారీ సులభం</u>:** మీరు చేయాల్సిందంతా నీరు, పంచదార కలపడమే. నిమిషాల్లో రెండు సీసాల సిరప్ తయార్ ! దీనితో 32 గ్లాసుల రసనా మధుర పానీయం తయారుచేసుకోవచ్చు. మీకు ఎప్పుడు కావాలన్నా సరే 1 నుండి 32 గ్లాసుల పానీయం తయారుగా వుంటుంది.

**<u>ఎంతో ఆదా</u>:** ఎందుకంటారా? దీన్ని మీరు ఇంటిలో తయారు చేసుకొంటారుగా ! అందుకే, దీనికయ్యే ఖర్చు మరే సిరప్ స్క్వాష్‌పై పెట్టే ఖర్చులో సగమే. కాని ఇది మధురాతి మధుర పానీయం ఎందుకంటే దీన్ని తయారు చేసింది మీ అమృత హస్తంగా!



**<u>పసందైన ఎంపిక</u>:** రసనా 9 గొప్ప రుచులలో లభ్యం. **ఆరెంజ్, పైనాపిల్, లైమ్, కాలాఖట్టా, మిక్స్‌డ్ ఫ్రూట్, రోస్, ఖస్, మసాలా మిల్క్, మసాలా సోడా.** ప్లెయిన్ లేక సోడాతో—ఎలా త్రాగినా భలే మజాగా వుంటుంది.

**<u>పూర్తిగా పరిశుద్ధం</u>:** రసనా పూర్తిగా ఆటోమేటిక్ ప్లాంట్‌లో తయారైనది. అందుకే పూర్తిగా పరిశుద్ధమైనది. ఏకరీతి రుచి మరియు అసమాన నాణ్యత గలది.




సాఫ్ట్ డ్రింక్ కాంసెంట్రేట్

**ఎంతో రుచి**
**ఎంతో ఆదా**
**ఇప్పుడు రకరకాల రుచులు**

ఇచ్చట కూడా లభ్యం కువైట్, దుబాయ్, బహరిన్, మారిషస్, కైరో, ఖార్తూమ్, లుసాకా,

Mudra A PI 2118 TEL

# ఆదర్శం

కిశోరి

"కామాక్షీ! కామాక్షీ!" సంతోషంగ భార్యను పిలుస్తూ వంటింట్లో అడుగుపెట్టాడు పార్వతీశం

"ఏమిటండీ! ఆ హడావుడీ! అంత గావుకేకలేస్తూ వచ్చారేమిటి? ఏదో కొంప మునిగినట్లు" అంది కామాక్షమ్మ తరిగిన అరటికాయ ముక్కల్ని బాణలిలో వేస్తూ

"అమ్మాయికి సంబంధం కుదిరిందే"

"నిజంగానే? అబ్బాయి దేవూరు? ఎక్కడ పని-చేస్తారు? కట్నమెంత?

"ఆగాగు? ఆత్రంగ ఒక్కసారి అన్ని ప్రశ్నలు వేస్తే ఎలాగే? ఆ చేత్తో వేడి వేడి కాఫీ ఇస్తే అన్ని వివరాలు చెప్తాను" అంటూ వంటింట్లో పీట వాల్చుకుని కూర్చున్నారాయన

పొయ్యిమీది బాణలి దించి గిన్నెలో కాసిని నీళ్ళు-పోసి పెట్టింది

"ఇక చెప్పండి" అంటు ఆయన కెదురుగా కూర్చుంది మీనాక్షమ్మ

"కాఫీ త్రాగుతే కానీ చెప్పను" మొండికేశారాయన

"బాగుంది సంబందం" అంటూ మరుగుతున్న నీళ్లలో కాఫీపొడి వేసి దించి, పాలగిన్నె పెట్టింది ఐదు నిమిషాల్లో కాఫీ కలిపి భర్తకిచ్చింది

'నీవూ త్రాగు మరి" అన్నారాయన

ఊహూ ముందు చెపుతే కానీ త్రాగను" అంది మొండిగా అలాగైనా త్వరగా చెపుతారనే ఉద్దేశంతో

అయితే చేపుతానుండు అంటు కాపీ తాగుతూ చెప్ప సాగేరాయన

అబ్బాయి ఈ ఊళ్లోనే స్టేట్ బ్యాంక్‌లో క్లర్క్‌గా పని చేస్తున్నాడు వెనుకా ముందు ఎవరు లేరట మేనమామతప్ప ఆయనే తల్లి తండ్రిలేని ఇతన్ని పెంచి పెద్దచేసి తన కొడుకులతో పాటు బి ఏ దాక చదివించారు చదువు పూర్తయిన సంవత్సరం లో గానే బ్యాంక్‌లో ఉద్యోగం వచ్చింది రెండు నెలల క్రితమే ఇక్కడికి ట్రాన్స్‌పర్ అయిందట కట్నం పైసా అక్కరలేదట మనమ్మాయిని స్కూల్ కెళ్లే-టప్పుడు చూశాడట అమ్మాయి నచ్చిందన్నాడట మీ రామారావన్నయ్య చెప్పాడీ విషయాలన్నీ ఇద్దరం కలసి అబ్బాయితో మాట్లాడాము ఈ చైత్ర మాసంలోనే మంచి ముహూర్తం చూచి పెళ్లి సింపుల్‌గా కానివ్వ మన్నాడాబ్బాయి "

ఎంత చల్లని వార్త తెచ్చారండీ తండ్రి ఏడు-కొండలవాడా అంతా నీ దయ" మనసులోనే భగ-వంతున్ని స్మరించింది

ఇంతకూ అమ్మాయి ఏదీ కనబడలేదు?"

ఇద్దరూ సినిమా కెళ్లారు ఆదివారం కదా వెళ్తా-మని చిన్నది మారాం చేస్తే పిల్చు కెళ్లింది ఆశ "

పార్వతీశం రిటైర్డ్ అవగానే నెలకు రెండువందల జీతంతో బట్టల షాపులో పద్దులు వ్రాయడానికి కుదిరాడు ఆయన రిటైర్డ్ అయిన సంవత్సరంలోనే పెద్దమ్మాయి ఆశాలత ఇంటర్ పూర్తి చేసింది





నృత్య కళాకోవిదకైనా నవచైతన్యాన్ని కలిగించే
నవ వనితా పక్షపత్రిక కలువబాల! (ఫొటో :- రవిచందర్)

ఇంటర్ అవగానే టీచర్ ట్రైనింగ్ పూర్తిచేసి ఆ వూరిలోనే ప్రాథమిక పాఠశాలలో టీచర్‌గా చేరింది ఆమె జీతమూ పార్వతీశంకు వచ్చే పింఛనుతో ఇల్లు గడుపుకొంటూ బట్టల షాపులో వచ్చే రెండు వందలూ బ్యాంక్‌లో వెయ్యసాగారాయన కూతుర్ల పెళ్ళిళ్ల కోసం ఆశాకు బ్యాంక్‌లో పని చేసే శేఖర్‌తో సంబంధం కుదిరేనాటికి బ్యాంక్ బ్యాలన్స్ రెండువేలా ఎనిమిది వందలైంది ఆ డబ్బుతో ఆశా పెళ్ళి క్లుప్తంగా జరిపించేశాడు పార్వతీశం

## ఆదర్శం

మంచి రోజు చూసి కామాక్షమ్మ పార్వతీశం ఇద్దరూ ఆశాలతను అత్తవారింట్లో దిగవిడచి వచ్చారు శేఖర్ ఉంటున్న ఇల్లు కాస్త చిన్నదే అయినా ఒక హాలు వంటగది బాత్‌రూమ్ లెట్రిన్‌లతో సౌకర్యంగా ఉంది ఇద్దరే కనుక ఇల్లు సరిపోతుంది శేఖర్ తనే వంట చేసుకునేవాడు కనుక వంటింట్లో సామాగ్రి గ్యాస్ స్టవ్ గ్రైండర్‌తో సహా అన్ని సౌకర్యాలు ఉన్నాయి నాలుగేండ్లనుంచి బ్యాంక్‌లో ఉద్యోగం చేస్తున్నాడు కనుక అన్ని సమకూర్చుకున్నాడు స్కూటర్ కూడ కొన్నాడు బ్యాంక్‌లో ఐదువేలదాకా బ్యాలెన్స్ కూడ ఉంది వంటింట్లో అన్ని వసతులూ చూడగానే కూతరి అదృష్టానికి మురిసిపోయింది కామాక్షమ్మ ఆశా మనసు కూడా హాయిగా ఉంది గ్యాస్ స్టవ్ కాబట్టి త్వరగా వంట ముగించుకుని స్కూలుకు వెళ్లవచ్చునని వంటింట్లో అన్ని నీట్‌గా సర్ది ఉండటంతో కామాక్షమ్మకు అక్కడ ప్రత్యేకంగా సర్దే పనిలేదు ఆ రాత్రికి అందరూ తమ ఇంట్లోనే భోజనాలు చేయాలని పట్టుపట్టడంతో కామాక్షమ్మ ఆశావంట పనిలో మునిగారు ఆశా చెల్లెలు జయమాత్రం హాల్లోని అలమరలో బావగారు నీట్‌గా సర్దిపెట్టిన నవలల మీద దాడి చేసింది అందులో ఎక్కుగా విశ్వనాథ సత్యనారాయణ వారివి ముప్పాళ రంగనాయకమ్మ యద్దనపూడి మాదిరెడ్డి అరికపూడి కావిలిపాటి విజయలక్ష్మిగార్ల నవలలున్నాయి మిగిలినవి వేరే రచయితలవి రచయిత్రులవి ఉన్నాయి

బావగారూ మీ హాబిట్సన్ని నాకు బాగా నచ్చాయండి ఏవి చూసినా నీట్‌గా సర్దారు అంది శేఖర్‌ను మెచ్చుకుంటు విశ్వనాధవారి పునర్జన్మ పుస్తకం తిరగేస్తూ

ఆమె మాటలకు పెద్దగా నవ్వాడు శేఖర్ బావగారు అంత పెద్దగా నవ్వే మాట తనేమందో అర్థం కాలేదు జయకు ఆ అర్థం కాని జయ ముఖం చూచిన శేఖర్

నీకు నచ్చేదేమిటి మీ అక్కకు నచ్చాలికాని అన్నాడు నవ్వుతూ

బావగారి మాటలకు అర్థం గ్రహించిన జయ ముఖం ఎర్రబడింది సిగ్గుతో వారి మాటలు వంటింట్లో నుంచి వింటున్న కామాక్షమ్మ ఆశ కూడా నవ్వుకున్నారు

ఆ రాత్రి అందరి భోజనాలు అవగానే తమలపాకులు తెమ్మని భర్తకు పురమాయించింది కామాక్షమ్మ

స్కూటరుందిగా నే వెళ్ళొస్తాను మీరుండండి అంటూ డ్రస్ చేసుకొని వెళ్ళిపోయాడు శేఖర్

కామాక్షమ్మ పార్వతీశం ఆశ బయట వరండాలో కూర్చున్నారు జయ మాత్రం హాల్లో నవల చదువుతూ కూర్చుంది

శేఖర్ బయటికి వెళ్ళగానే ఆశ తండ్రితో-

నాన్నా! ఈ నెల నుంచి జీతం మొత్తం ఈయనకే ఇవ్వమంటారా?

ఆ మాటలకు చిన్నగా నవ్వాడు పార్వతీశం

అదేమిటమ్మా అలా అడుగుతావు? ఆయనకీయక నాకిస్తావా? పిచ్చి తల్లి వివాహ మయిపోగానే నీవు నీకు సంబందించిన ప్రతి ఒకటి అతని సొత్తే కదమ్మా

మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
సూపర్ రిన్ తో తళతళలాడే
ఆ తెల్లదనం




**సూపర్ రిన్ తో తళతళలాడే తెలుపు**

మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

అందుకేనన్నమాట ఆదర్శం పేరుతో కట్నం తీసు కోనన్నది

అలా అనకమ్మా! నీకు ఉద్యోగం ఉన్నా పదివేలకు తక్కువ కాకుండా ఎవరూ కట్నం అడగలేదు. ఉద్యోగం చేస్తున్నందుకు పదివేలు, అదీ లేకపోతే నలభై యాభై వేలకు గాని తూగలేదు ఇంతవరకు నేను చూచిన సంబంధాలలోని పెళ్ళి కొడుకులు కానీ కట్నం లేకుండా లాంఛనాలు లేకుండా సింపుల్‌గా నీ పెళ్ళి జరిగి పోయిందంటే ఇది తప్పకుండా అతని విశాల హృదయానికి చిహ్నం కదమ్మా ఇక మా సంగతులంటావా? ఈ సంవత్సరంతో జయ ఇంటర్ పూర్తి చేస్తుంది దాన్ని కూడా ట్రైనింగ్‌కే పంపుతాను ఉన్న దాంట్లో ఎలాగో ఇల్లు గడపక తప్పదుకదా! ఉదయం, రాత్రి ట్యూషన్లు చెప్పుకుంటాను ఇవన్నీ నీవు ఆలోచించి మనసు పాడు చేసుకోకు అబ్బాయి రత్నం లాంటివాడు ఏ చెడ్డ అలవాట్లులేవు సంతోషంగా కాపురం చేయమ్మా అన్నారాయన కూతురి తల నిమురుతూ

తండ్రి మాటలకు మనసు కలత చెందింది ఈ వయసులో షాపులో పద్దులు వ్రాస్తూ మళ్ళీ ట్యూషన్లు చెప్పుకుంటూ తండ్రి ఆరోగ్యం పాడై పోతుంది ఈ మాటే అతనితో అంది అలా అంటున్నప్పుడు ఆమె కళ్లలో లీలగా తడి మెరిసింది

పిచ్చి తల్లీ! బాధపడకు ఆడపిల్లలను కన్నాక తప్పదు తల్లీ దాన్ని ఓ అయ్య చేతిలో పెడితే మాకిక నిశ్చింత తిన్నా, తినకపోయినా అడిగేవారుండరు ఆ వచ్చే పింఛను డబ్బుతో మా జీవితాలు గడవకపోవు " అంటూ ఆశా కళ్లలో కన్నీళ్లను చూచి ఆమె తలను గుండెల హత్తుకున్నారు

"బెంగపడకమ్మా! నిన్ను మంచి చోట ఇవ్వగలిగాను ఆ తృప్తి చాలు నాకు నీకు సుఖంగా, సంతోషంగా ఉంటే ఎన్ని కష్టాలైనా ఎదుర్కోగలను నేను బిడ్డల సుఖ, సంతోషాల కన్నా తల్లిదండ్రులు వేరే కోరే దేముందమ్మా' అంటూ ఓదార్చారు తండ్రి ఓదార్పుతో ఆశ దుఃఖం ఉధృతమైంది

అంత వరకు తండ్రి కూతుర్ల సంభాషణ వింటున్న కామాక్షమ్మ ఆశ వీపు తట్టి ఆశా ఏడ్వకు మంచి భర్త దొరికినందుకు సంతోషించు మా గురించి ఆలోచిస్తూ మనసు పాడు చేసుకోకమ్మా! అబ్బాయి వచ్చేస్తాడు లే! వెళ్ళి ముఖం తుడుచుకో అంది జీరబోయిన కంఠంతో

ఆశా బలవంతంగా లేచి వెళ్ళి కళ్ళు తుడుచుకుంది

శేఖర్ రాగానే అందరూ తాంబూలాలు వేసుకున్నారు రాత్రికి అక్కడే పడుకోమని శేఖర్ చెప్పాడు కానీ ఇల్లు చిన్నది వెళ్తామంటూ లేచారు ఇల్లు దూరమవడం చేత రిక్షా పిల్చుకువచ్చి కామాక్షమ్మను జయను అందులో వెళ్లమని, ఆశాను తలుపు వేసుకొమ్మని చెప్పి తన స్కూటర్‌పై పార్వతీశంను ఎక్కించుకుని బయలుదేరాడు శేఖర్

## ఆదర్శం

* * *

తనను ప్రాణంకన్నా మిన్నగా ప్రేమించే భర్త సమక్షంలో రోజులు త్వర త్వరగా గడచి పోతున్నట్లు భావించింది ఆశ ఆశ కాపురానికి వచ్చిన తర్వాత పని మనిషిని మాన్పించింది శేఖర్, ఉండనివ్వమన్నా వినకుండా ఇద్దరి వంటకు ఎన్ని గిన్నెలు పడతాయి? నేను తోముకోగలను లెమ్మన్నది మరి మారు మాట్లాడ లేక పోయాడు ఆమె గిన్నెలు తోమేస్తుంటే వద్దని వారిస్తున్నా వినకుండా కడిగేవాడు వంట చేస్తుంటే కూరలు తరిగివ్వటం, బియ్యం కడిగి పెట్టడం, గ్రైండర్‌లో పొడులు వేసివ్వడం ఇలా హెల్ప్ చేసేవాడు ఆమె చేయవద్దన్నా వినేవాడుకాదు

ఏం? చేస్తే తప్పేం ఉంది నీవు రాక ముందు నేను చేసుకోలా? అప్పుడు బ్యాంక్ కెళ్ళి వచ్చి ఈ పనులన్ని చేసుకోవాలంటే ఎంత విసుగ్గా ఉండేదో నాకు బాగా తెలుసు నీవు ఉద్యోగం చేసేదానివి నీకూ అలాగే ఉంటుంది కాబట్టి ఇద్దరూ కలసి త్వరగా వంట పూర్తిచేసుకుని కాసేపు రెస్ట్ కూడా తీసుకొని మనం బయటికి వెళ్లచ్చు నేను మాత్రం ఖాళీగా కూచుని చేసేదేముంది " అని అనేవాడు

అతనాలా అంటుంటే ఆశాకు అమితమైన ఆనందంతో నోటి మాట రాలేదు తను నిజంగా చాలా అదృష్టవంతురాలు భార్యలను మాటలతో, చేతలతో బంధించే భర్తలను తను చాలామందిని చూసింది అందుకే పెళ్ళి అనగానే భయంవేసింది కానీ ఈ 20వ శతాబ్దంలో అందునా భారత దేశంలో సిసలైన ఆంధ్రుల ఆడ పడుచుగా తమ తల్లిదండ్రులను ఎదిరించలేక కిమ్మనకుండా పెళ్ళికి ఒప్పుకుంది అందరు పురుషులు ఒకలాగ ఉండరని, భార్యను ప్రాణంలా చూసుకునే భర్తలు కూడా ఉన్నారని కాపురానికి వచ్చిన తర్వాత తెలుసుకుంది

వంట పూర్తవగానే ఇద్దరూ ఒకేసారి భోంచేస్తారు స్కూలు దూరం కావడంతో చిన్న బాక్స్ మధ్యాహ్నానికి కాస్త పెరుగన్నం తీసి కెళ్తుంది ఆశ శేఖర్ మాత్రం ఆఫీస్ క్యాంటిన్‌లోనే టిఫిన్ తీసుకుంటాడు తొమ్మిదింపావు కాగానే ఇద్దరూ ఇంటికి తాళంవేసి స్కూటర్‌పైన బయలుదేరుతారు ఆశను స్కూల్ దగ్గర విడిచి శేఖర్ బ్యాంక్‌కి వెళ్ళిపోతాడు

ఆదివారం మాత్రం ఉదయాన్నే టిఫిన్ ముగించుకొని ఆశా, శేఖర్‌లు పార్వతీశం ఇంటికి వెళ్తారు మధ్యాహ్నం భోజనాలు చేసి కుటుంబ సభ్యులంతా బాతాఖానీ కొట్టడమో లేక ఆశ, తండ్రి, బావ మరదలు పార్ట్‌నర్స్‌గా ఉండి క్యారమ్స్ ఆడడమో చేస్తూ సాయంత్రం వరకు కాలం గడుపుతారు సాయంత్రం కాగానే అందరినీ వద్దంటున్నా సినిమాకు బయలుదేర దీస్తాడు శేఖర్

అల్లుడి రాకతో ఇంటికి సందడి వచ్చింది అంటుంది కామాక్షమ్మ శేఖర్‌ను మురిపెంగ చూస్తూ

ముందొచ్చిన చెవులకంటె వెనొకొచ్చిన కొమ్ములు వాడంట ఇద్దరు ఆడ పిల్లలం మేము ఉండగా అల్లుడిగారి రాకతో ఇంటికి సందడి వచ్చిందట అని ఉడుక్కుంటుంది ఆశ

"అత్తయ్య మీ అమ్మాయి నన్నన్నారని ఉడుక్కుంటుంది కానీ ఓ విషయం చెప్పనా మీ అమ్మాయి మా యింటికొచ్చినప్పటినుంచి నాకు ఎలక్ట్రసిటీ చార్జ్ లేదు తెలుసా ఇంతకుముందు నెల కొకసారి ఆ బిల్ కట్టలేక చస్తుంట ఇప్పుడు ఈవిడగారి రాకతో లైట్ వేసే పని లేదసలు అంతటి వెలుగు నింపింది మీ అమ్మాయి నా ఇంట్లో అంటు నవ్వు పెదవుల మధ్య దాచుకుంటు సీరియస్‌గా అన్నాడు శేఖర్

ఓ బావ పెంటాస్టిక్ జోక్" అంటూ విరగబడి నవ్వింది జయ

ఆశకు నవ్వు వచ్చినా భర్త అన్న మాటకు ఉడుక్కుని కోపంగ లోపలికి వెళ్ళిపోయింది

ఇలా ప్రణయ కలహాలతో నెల రోజులు నిముషంలా గడచి పోయాయి

ఆరోజు ఇరవై తొమ్మిదో తారీఖు శేఖర్‌కు జీతాలిచ్చారు జీతం రాగానే ఆశాకిచ్చాడు

"ఇదేమిటి? నా చేతి కిచ్చారు? ఆశ్చర్యపోతూ అడిగింది ఆశ

"నీ కివ్వక ఎవరి కిమ్మంటావు ఇకనుంచి ఇంటి ఖర్చులూ లెక్కలూ చూసుకునే బాధ్యత తమరిదే" అన్నాడు శేఖర్ నవ్వుతూ

"అమ్మ బాబోయ్! పెద్ద బాధ్యతే అప్పజెప్పారు నాకు" అది తనూ నవ్వుతూ

"చూడమ్మాయ్! నాకు రోజు అర్ధ రూపాయి కావాలి" అన్నాడు సీరియస్‌గా అతనూ అంటుంటె "అమ్మా! నాకో పది పైసలివ్వవూ చాక్‌లెట్ కొనుక్కుంటానని" పసి పిల్లాడన్నట్లనిపించి పక్కున నవ్వింది

"ఏమ్మా! అర్ధ రూపాయి పెట్టి చాక్‌లెట్ కొనుక్కుంటావా?" అంది హాస్యంగా

"చాక్‌లెట్ కొనుక్కోడానికి నేను చిన్న పిల్లాడినా?" అంటూ మూతి ముడుచుకున్నాడు

"కాక మీ రడిగేతీరు అలాగే ఉంది అలా ముద్దుగా ముఖం పెట్టి అడుగు తూంటె అలాగే అనిపించింది "

"అంత ముద్దు వస్తే పెట్టేసుకోరాదూ నేను వద్దన్నానా?" అంటూ చిలిపిగా తన చెంపను ఆమె ముఖం దగ్గర పెట్టాడు

"ఛీ పొండి చిలిపితనం ఎక్కువయిపోయింది" అంటూ సున్నితంగా అతని చెంపపై దెబ్బ వేసింది

"ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడు చూపించాలోయ్

చిలిపితనం" అంటూ తనే ఆమెను దగ్గరకు లాక్కొని ముద్దు పెట్టుకున్నాడు

"ష్ . తలుపు తెరిచే ఉంది" అంటూ మెల్లగా అతని చేతుల్లోంచి విడిపించుకుంది

"పోనీ తలుపు మూసెయ్యనా? అంటు వెళ్ళ-బోతున్న అతన్ని షర్ట్ కాలర్ పట్టి ఆపింది

"ఇంతకూ మీ కర్చు రూపా యెందుకంట రోజా?" మాట మారుస్తూ అడిగింది సందేహంగా

"ఎందుకా? ఈ దేవిగారికి పూలు తేవడానికి! తెచ్చి పూజ చేయడానికి' అన్నాడు ఆమె తలపై పూలు చల్లుతున్నట్టు అభినయిస్తూ

"చాల్లెండి ఎవరైనా వింటే నవ్వుతారు ఊసుపోక ఏవో కబుర్లలో నాకు పూలంటే ఇష్టమని చెప్పానని రోజూ పూలు పట్టుకు రమ్మనా అర్థం" అంది నవ్వుతూ

"నవ్వితే నవ్వనీ – కుళ్ళుకుంటారు" అంటూ గుమ్మం తలుపువేసి వచ్చి ఆమెను చేతులతో చుట్టి వేశాడు ఆమె ఏదో మాట్లాడబోతుంటే మరి మాట్లాడనివ్వలేదు

* * *

ఆశాకు ఆ రోజు జీతా లిచ్చారు ఆమె మనసు కలవరపడింది ఈ జీతం శేఖర్ కివ్వక తప్పదు పుట్టింటి పరిస్థితులు గుర్తుకు రాగానే ఆమె గుండెల్లో ఏదో తెలియని బాధ మొదలైంది ఆకాశాన్నంటే ధరలున్న ఈ కాలంలో తండ్రి పించను, పాపుల్లో వచ్చే రెండు వందలతో ముగ్గురు నెలంతా ఎలా గడుపుతారు? అర్ధాకలితో అలమటించక తప్పదు తన వాళ్ళు తనేమో ఇంత సుఖంగా ఉంది ఇలా అనుకోగానే ఆమె మనసెలాగో అయిపోయింది ఎలా ఇంటికి వచ్చిందో ఆమెకే తెలియదు రాగానే ముఖం కూడా కడుక్కోకుండా వాకిలి చేరవేసి, పుస్తకాలు, పర్స్ టేబుల్ పైన పడేసి మంచంపైన వాలిపోయింది తలనొప్పి అనిపించింది అయినా కాఫీ కూడా పెట్టామనే మూడ్‌లేక అలాగే ఆలోచిస్తూ పడుకుంది

అదేమిటి ఆశా! ఏమైంది అలా మంచంకు అడ్డంగా పడుకున్నావు? ఆదుర్దాగా వంగి ఆమె నుదుటిపై చెయ్యి వేసి చూశాడు. జ్వరంగాని వచ్చిం-దేమోనని

శేఖర్ వచ్చింది కూడా గమనించలేనంతగా ఆలోచిస్తున్న తన ఆలోచనలను ప్రక్కన నెట్టి "ఏమి లేదు కాస్త తల నొప్పిగా ఉంటేను పడు-కున్నాను" అంటూ లేవబోయింది

"ఆ ఆ లేవకు పడుకో కాఫీ తీసుకుని వస్తాను" అంటూ ఆమెను వారించాడు

బట్టలు మార్చుకొని కాళ్ళు ముఖం కడుక్కొని వంటింట్లో కొచ్చి గ్యాస్ వెలిగించి నీళ్ళు పెట్టాడు ఫిల్టర్‌లో కాఫీ పొడి వేసి నీళ్ళు మరగగానే అందులో నీళ్ళు పోసి మూత పెట్టాడు ఈలోగా పాలమ్మాయి పాల చెంబు ఇచ్చి వెళ్ళింది పాలు గిన్నెలో పోసి 'సిమ్ మీదపెట్టి వచ్చి ఆశాను లేపాడు

"ఆశా లే లేచి ముఖం కడుక్కో కాస్త ఫ్రెష్‌గా ఉంటుంది" అన్నాడు

ఆశా లేచి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చింది ఆమె ముఖం కడుక్కొని తడుచుకుంటుండగా బొట్టు, కాటుక పౌడరు, అద్దం దువ్వెన తెచ్చి మంచంపై రెడీగా ఉంచాడు

"ఎందుకండీ మీకీ శ్రమ ఎంత తల నొప్పయితే మాత్రం అద్దం ముందు కూర్చుని తల దువ్వుకోలేనా మీరు నన్ను మరీ చిన్న పిల్లను చేస్తున్నారు"

'మనకు పిల్లలయేదాకా నీవు నాకు చిన్న పిల్లవే ఎలాగైనా నీవు నా కంటె చిన్నదాన్వె కదా నీవు జడ వేసుకుంటుండు నేను ఈలోగా కాఫీ పట్టుకొస్తా-నంటూ వంటింటి వైపు నడిచాడు

అతను కాఫీ కలుపుకొని తెచ్చేసరికి జడ వేసుకొని బొట్టు పెట్టుకుంది

వెరీగుడ్! ఆడవాళ్ళ ముస్తాబు త్వరగా తెమలదని ఏ వెధవ అన్నాడో కానీ వాడికి నిన్ను చూపించి నాలుగు తన్నాలి నవ్వుతూ అంటూ ఆమెకు గ్లాసు అందించి ఒక శారిడన్ తెచ్చి ఇచ్చి వేసుకోమని ఆమె ప్రక్కనే కూర్చున్నాడు

కాఫీ రుచి చూచిన ఆశ అచ్చా మీరు చేసిన కాఫీ చాల బాగుంది అంది నవ్వుతూ మెచ్చుకోలుగా

మరీ ఇక రోజు నన్నె చేసివ్వమంటావా ఏం? అన్నాడు భయం నటిస్తూ

చీ పొండి, నేను ఏది మాట్లాడినా మీకు విడ్డూ-రంగానే ఉంటుంది మీరు అంత భయపడాల్సిన పని లేదు లెండి" అంది నవ్వుతూ

పిచ్చీ , తమాషా కన్నానులే. అదో పెద్ద పనా భయపడడానికి ప్రతీ రోజు నీకు నేనే కలిపిస్తాను కానీ ఈ పూటకి వంటింటి చాయలకు కూడా రాకుండ బుద్ధిగా పడుకో' అంటూ లేవబోయాడు

నిదానంగా ఇద్దరం కలిసే చేద్దాము కాసేపు కూర్చోండి అంటూ అతన్ని కూర్చోబెట్టి అతని వడిలో తల పెట్టుకుని పడుకుంది

అతను ప్రేమగా తల నిమర సాగాడు ఆ స్పర్శతో మధ్యాహ్నం నుంచి అనుభవిస్తున్న బాధంతా మాయమైంది అలా పడుకున్న ఆమెకు ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియలేదు ఎనిమిదిన్నర అవుతుండగా అతను తట్టి లేపితే లేచింది అప్పటికే వంట ముగిం-చేశాడు

అయ్యో ! వంట కూడా చేసేశారా! నన్ను ఎందుకు లేపలేదు అంటూ తన మొద్దు నిద్రను తిట్టుకుంటూ లేపనందుకు అతనిపై చిరుకోపం ప్రదర్శించింది

పసితనపు అమాయకత దోబూచులాడుతున్న ఆ ముఖాన్ని, దిండుపై తల ఆన్చి నిద్రిస్తున్న నిన్ను లేపితే పాపం వస్తుందేమోనని లేపలేదు కానీ ముందు వెళ్ళి ఆ నిద్ర ముఖాన్ని కడిగిరా భోంచేద్దాం అంటూ చిరునవ్వుతో ఆమెను బాత్ రూమ్ వైపు త్రోశాడు

ఇద్దరూ భోంచేశాక అతను కంచాలు తీయ-బోతుంటే కోప్పడి తనే తీసింది భోజనాలయ్యాక తన జీతం సంగతి గుర్తుకు వచ్చి జీతం అంతా అతని చేతి కిచ్చింది

ఈవేళ జీతా లిచ్చారా అంటూ డబ్బు తన షర్ట్ జేబులో పెట్టాడు

తను వెళ్ళి పడక చేరింది అతను లైట్ తీసేసి బెడ్ లైట్ వేసి మౌనంగా పడుకున్నాడు అతనా డబ్బు గురించి ఏమైనా మాట్లాడుతాడేమోనని ఎదురు చూసింది కానీ అతనా డబ్బు గురించి ఏమి మాట్లాడక పోయేసరికి ఆమె మనసులో మళ్ళీ బాధ చోటు చేసుకుంది అతను ఏవో తన బ్రాంచ్‌కు వచ్చిన డబ్బు కూడా సరిగ్గా లెక్క పెట్టుకోలేని అమాయక ప్రజానీకాన్ని గురించి చెపుతుంటె తను



మెల్లగా ఊకొడుతూ నిద్ర నటించింది ఆమె నిద్ర పోయింది పాపం ఈవేళ తల నొప్పిగా ఉంటందని ఎలాగై పోయిందో అనుకుంటు అతను అటు వైపు తిరిగి పడుకున్నాడు ఆ రాత్రంతా ఆమెను నిద్రాదేవి కరుణించలేదు పరి పరి విదాల ఆలోచిస్తూ ఏ మూడు గంటల వేళో నిద్రపోయింది

* * *

ఉదయం కాఫీ త్రాగాక పనుందంటూ స్కూటరు తీసుకుని బయటికి వెళ్ళిపోయేడు శేఖర్ ఎన్నడూ లేంది ఉదయాన్నే బయటకు వెళ్తున్న అతన్ని చిత్రంగా చూచింది ఆశ నిద్ర లేమిచేత కళ్ళు మంటలు పుడుతున్నాయి రోజు వంటలో సాయం చేసే అతను ఈ రోజు వుదయాన్నే వెళ్ళడంతో వంట పనంతా తను ఒక్కతే చేసుకోవడం శ్రమ అనిపించినా, 'అతను ఉదయాన్నే ఎందుకెళ్ళారా అని ఆలోచిస్తూ తొమ్మిది గంటలకంతా వంట ముగించింది ఏదైనా పని ఉంటె తనతో చెప్పి ఉండచ్చుకదా? ఎందుకిలా ఎందుకైంది చెప్పకుండా వెళ్ళాడో అర్థం కాలేదామెకు తొమ్మిదీ పది అవుతుండగా అతను వచ్చాడు

బయటికి వెళ్ళేటప్పుడు ఎక్కడికి అని అడగడం మంచిదికాదు వస్తూనే ఎక్కడికి వెళ్ళింది చెపుతారులే ' అని ' సరిపెట్టుకున్న ఆమెకు అతను మాట్లాడకుండ భోజనానికి కూర్చోవడంతో ఇప్పుడు ఎక్కడికి వెళ్ళారు అని అడగడానికి అబిమానం అడ్డు వచ్చి మౌనంగా భోజనాలు పెట్టసాగింది ఆశ భోంచేసేటప్పుడన్న అతను ఎక్కడికి వెళ్ళింది చెపుతాడని ఆశించింది ఆశ ఎంతో ఆశతో కానీ ఆమె ఆశ నిరాశ చేశాడప్పుడు కూడా గబగబ భోంచేసి లేచాడు శేఖర్

'త్వరగా భోజనం కానీయ్ ఆశా మనకు టైమయింది కదా అంటూ త్వర పెట్ట సాగాడు శేఖర్

ఆలోచనలు ప్రక్కన పెట్టి భోజనం చేయసాగింది ఆశ అంతలోపు ఆయన పెరుగన్నం బాక్సులో పెట్టసాగాడు ఆమె భోజనం ముగించి వంటిల్లు సర్దేలోగా శేఖర్ డ్రస్ చేసుకుని స్కూటర్ బయటికి తీశాడు ఆశ ఇంటికి తాళం వేసి మౌనంగా స్కూటర్ ఎక్కింది అతను కూడా ఏమి మాట్లాడించలేదు అతను కూడ అంతే మౌనంగా స్కూల్ దగ్గర దింపి వెళ్ళిపోయాడు

ఆ పూట పిల్లలకు కూడా పాఠాలు చెప్పలేక పోయింది మధ్యాహ్నం అన్నం కూడ తినాలనిపించలేదు మధ్యాహ్నం రెండు పీరియడ్స్ తీసుకుని తల నొప్పంటూ హెడ్మిస్ట్రస్‌తో పర్మీషన్ తీసుకుని బయటికి వచ్చింది అప్రయత్నంగా ఆమె కాళ్ళు పుట్టింటి వైపు నడిచాయి

అనుకోకుండ వచ్చిన కూతుర్ని చూచి ఆనందపడి ఎదురు వచ్చింది కామాక్షమ్మ

'ఏమ్మా? నీ వొక్క దానివే వచ్చావు? అల్లుడుగారేరి? నీకు ఈవేళ స్కూల్ లేదా' అంటూ ప్రశ్నలు వేసింది స్కూల్ టైమ్‌లో వచ్చిన కూతుర్ని అంత సంతోషంలోను కాస్తంత సందేహంగా అడుగుతూ

తల నొప్పిగా ఉంది కాఫీ ఇవ్వమ్మా అంది ఆశ చేతిలోని పుస్తకాలు, పర్స్ టేబుల్‌పైన పడేసి మంచంపైన వాలిపోయింది

కాఫీ కలిపి కూతురు చేతి కిస్తూ మళ్ళీ అడిగింది కామాక్షమ్మ అల్లుడు రాని కారణం

ఆయనకు బ్యాంక్‌లో ఆడిటర్స్ వస్తారట లేట్ అవుతుందంటే నేనిలా వచ్చాను అంది ఆశ కళ్ళు మూసుకుంటూ

అదేమిటి ఆశా వేళకానివేళ ఏమిటి నిద్ర వెళ్ళి ముఖం కడుక్కో

నిద్ర పోవడం లేదు లేమ్మా! కాస్త అలసటగా ఉంది అంది కళ్ళ కడ్డంగా చేతు లుంచుకుని పడుకుంటూ

ఆమె మనసులో పరిపరి విధాల పోతుంది తన జీతం గురించి అమ్మ అడగలేదు అడగదు కూడ కానీ ఇకనుంచి వారి జీవితాలు ఎలా వెళ్ళబోతాయి? ఇలా ఆలోచిస్తూ మెల్లగా నిద్రలోకి జారిపోయింది ఆశ

రాత్రి ఎనిమిది గంటలకు పనిమీద పొరుగూరు వెళ్ళిన పార్వతీశం ఇంటికి వచ్చాడు ఇంట్లో కూతుర్ని చూచి సంతోషించాడు కానీ అలా ఆ సమయంలో నిద్రపోతున్న కూతుర్ని చూచి జ్వరం వచ్చిందేమోనన్న సందేహంలో నుదురుపై చేయివేసి చూశాడు ఆ స్పర్శకు మెలుకువ వచ్చింది ఆశకు

అబ్బా! ఎంత చీకటిపడింది ఇంతసేపు నిద్రపోయానా అనుకుంటూ కళ్ళు నులుముకొని తండ్రిని చూచి,

అరే! మీరా నాన్నా! ఊరికి వెళ్ళారని అమ్మ చెప్పింది అప్పుడే వచ్చేశారా' ఆశ్చర్యంగా అడిగింది తండ్రిని

అప్పుడే ఏమిటమ్మా! టైం ఎంతయిందనుకుంటున్నావు ఎనిమిదయింది ' అన్నారాయన అంటూనే కాళ్ళు కడుక్కుని వస్తానంటూ లేచి వెళ్ళారు

ఆమె కూడ లేచింది ముఖం కడుక్కోడానికి అక్కడే చైర్‌లో కూర్చుని చదువుకుంటున్న జయ అదేమిటక్కా! అంతగా నిద్రపోయావు నేను కాలేజినుంచి వస్తూనే నిన్ను చూచి నిద్రలేపుదామంటే అమ్మ లేపద్దు అని చెప్పింది నీవు ఎప్పుడు నిద్ర లేస్తావా అని ఎదురు చూస్తున్నా అంది

రాత్రంతా తల నొప్పిగా ఉండి నిద్రపోలేదు వుండు ముఖం కడుక్కుని వస్తాను అంటూ లోని కెళ్ళబోయింది

త్వరగా రా అక్కా అప్పటినించి నీకోసం ఎదురు చూస్తుంటే

జయా! నీకు ఎక్జామ్స్ దగ్గరగా వచ్చాయి కదా! ఇంకా కాసేపు చదువుకో తర్వాత మాట్లాడుకుందాము అంటూ వెళ్ళింది

పార్వతీశం ముఖం కడుక్కుని వెళ్ళి వరండాలో కూర్చున్నారు ఆశ ముఖం కడిగి బొట్టు మెట్టుకుంటుండగా అమ్మా ఆశా ఇలారా' అని వరండాలోనించి తండ్రి పిలుపు విని వరండాలో కెళ్ళింది ఆశ

ఆశా' ఇలా రా అమ్మా అంటూ తన ప్రక్కన చోటు చూపించాడు

అమ్మతో ఆడిటర్స్ వస్తారని ఆయన లేట్‌గా వస్తారని నీవు ఇక్కడికి వచ్చినట్టు చెప్పావట నీవు ఇక్కడికి వచ్చేది ఆయనకు చెప్పావా?" అనుమానంగా అడిగారాయన కూతురి ముఖంలోకి చూస్తూ

లేదు నాన్నా! అంది తల వంచుకొని

ఎందుకు చెప్పలేదు

ఏంలేదు స్కూల్‌నుంచి అనుకోకుండ ఇలా వచ్చేశాను

సరే అలాగే వచ్చావు మరి నీ ముఖం ఏమిటి అలాగుంది నావద్ద కూడా దాపరికమా? నీ ముఖం చూస్తుంటే ఏదో జరిగినట్లుంది నా క్కూడా చెప్పవా? చెప్పమ్మా!

అహ ఏం లేదు నాన్నా' అంది తడబడుతూ రాత్రినుండి తను మనసులో పడుతున్న బాధనంతా తండ్రికి చెప్పేసింది ఆయన మరి మరి అడిగేసరికి

'పిచ్చి ఆశా' ఇదంతా మనసులో పెట్టుకొని బాధపడుతూ కూర్చున్నావా? శేఖర్ నిజంగా రత్నంలాటి వాడమ్మా! అలాటి అల్లుడు దొరకడం నా అదృష్టం అంటున్న తండ్రివైపు చిత్రంగా చూసింది

అవునమ్మా! ఉదయాన్నే శేఖర్ మనింటికి వచ్చి నీ జీతం ఇచ్చి వెళ్ళాడు

ఏమిటీ ఆశ్చర్యంగా చూసింది

అవునమ్మా! నేను వద్దని ఎంత చెప్పినా వినలేదతను ఏమన్నాడో తెలుసా? మామగారూ! మీ రెన్నో ఆశలు పెట్టుకుని ఆశను చదివించారు కూతురిని కూడా కొడుకులా బావించి చదివించి ఉద్యోగం కూడా ఇప్పించారు కొడుకులు లేని మీకు నేను కొడుకుతో సమానమేగా మీ కష్టసుఖాలు పంచుకొనే బాధ్యత నాకు కూడా ఉంది బాధ్యతలు తీరేవరకు ఆశకు వచ్చే జీతం మీకే జయకు కూడా మంచి సంబంధం చూస్తాను వున్న దాంట్లో జయ పెండ్లి చేద్దాము అని అన్నాడమ్మా

అలాటి అల్లుడు ఎవరికైనా దొరుకుతాడా? ఆ అదృష్టం మాకు కలిగింది అంటూ అల్లుడు మహోన్నతనం గురించి తండ్రి సంతోషంగా పొగుడుతుంటె అవాక్కయి చూసింది ఆశ

నిజము? నాన్నా ఇదంతా నిజము?' సంతోషంతో నమ్మలేనంత ఆశ్చర్యంతో ఆత్రంగా అడిగింది

నిజమే నమ్మా! మనం అదృష్టవంతులం తల్లీ ఎలా ఈ సంసారాన్ని ఇకపై ఈదుకురావాలి? అని రేయింబగళ్ళు ఆలోచిస్తున్నా దేవునిలాంటి నీ

# మీ పెట్టుబడి రక్షణకు, మీ కుటుంబ క్షేమానికీ యుఎల్ఐపి



## ULIP ఒక్కటే మార్గం

యు.ఎల్.ఐ.పి. (యూనిట్ లింక్డ్ ఇన్సూరెన్స్ ప్లాన్)ని ఒక్కసారి బాగా పరీక్షించండి.

వైద్య పరీక్షతో నిమిత్తం లేకుండానే, అనుకున్న మొత్తానికి, మీకు జీవిత బీమా రక్షణ దొరుకుతుంది.

ఇంకా, అపాయాల సందర్భంలో, రూ. **15,000** ల దాకా మీకు రక్షణ లభిస్తుంది.

అంతేగాక, మీ పెట్టుబడిమీద మంచి ఫలసాయం వస్తుంది.

పైగా, మీరు వేసిన మొత్తంమీద రాబడి పన్నులో మినహాయింపు వుంటుంది.

**18** సంవత్సరాల నుండి **45½** సంవత్సరాల మధ్య వయస్సులో వుంటే, మీరు యు.ఎల్.ఐ.పి. పథకంలో చేరవచ్చు. రూ. **3,000/-** కనీస మొత్తం నుండి రూ. **12,000/-** గరిష్ట మొత్తం వరకు, **10** నుండి **15** ఏళ్ళ వరకు.

మొదటిసారి చేరిన మూడేళ్ల తర్వాత, మళ్లీ రూ. **12,000/-** లకు కొత్త పథకాన్ని తీసుకోవచ్చు.

**ఇతర వివరాలకు, మా ఏజెంట్లనుగాని, ముఖ్య ప్రతినిధులనుగాని, మీకు దగ్గరలో నున్న బ్యాంక్ ఆఫ్ బరోడా శాఖను గాని సంప్రదించండి.**




**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

(ప్రభుత్వ రంగంలోని ఆర్థిక సంస్థ)

హెడ్ ఆఫీస్, బొంబాయి-20

ప్రాంతీయ కార్యాలయం: 'రెజీనా మ్యాన్షన్', **46**, సెకండ్ లైన్ బీచ్, మద్రాస్-**600 001**. టెలిఫోన్: **27433**
ఆంధ్రప్రదేశ్ కార్యాలయం: **27/11/6B**, మేరీ స్ట్రీట్, గవర్నర్‌పేట, విజయవాడ-**520 002** టెలిఫోన్: **63964**

ఆంధ్రప్రదేశ్‌లో మా ముఖ్య ప్రతినిధి:

కె.బి. తిలక్, లియో సర్వీసెస్, **13**, అంజుమన్ బిల్డింగ్ (లాలాపేట పోలీస్‌స్టేషన్ దగ్గర), గుంటూరు-**5220 03** టెలిఫోన్: **(O) 23439** ● యర్రమిల్లి సోమసుందరరావు, నేతాజీ ప్రెస్, మెయిన్ రోడ్డు, తణుకు-**534 211** ఫోన్: **(R) 106** ● సి. నారాయణస్వామి, **15-5-4**, శైలేశ్వరసేన్ రోడ్డు, కృష్ణ నగర్, మహారాణిపేట, విశాఖపట్టణం-**530 002**.

**మీ మిగులు ధనాన్ని- యూనిట్ యూనిట్‌గా పెరగనివ్వండి!**

**20 YEARS OF TRUSTED SERVICE**

Sista's-UTI 242 84 TE R

# ధర్మపథం

# మన పని జరగాలంటే



ఇతర స్థలాలలో ఉన్న వారివల్ల మన పనులు జరగాలంటే జాబులు వ్రాస్తాము. వాటివల్ల ప్రయోజనం కనబడకపోతే మన మనుష్యులను పంపిస్తాము. అప్పటికీ అది సాధ్యం కాకపోతే స్వయంగా వెళ్లవలసి ఉంటుంది ఇలాగు జాబుకంటె మనిషికీ, మనిషికంటె తనకే బలం ఎక్కువ. ఆ రీతిగానే ఉన్న ఊరిలోనయినా సరే, ఏదయినా పని కావాలంటే తన మనుష్యులను పంపడంకంటె స్వయంగా ఆ పనిని చూసుకోవడం ఎంతో ఉత్తమం. తన పనిలో తనకు వుండే శ్రద్ధ ఇతరులకు చాలా అరుదుగా ఉంటుంది

ఒక భూస్వామి పొలంలోని ఒక గట్టుపైని ఒక చెట్టు వుంది అతడు తన పొలాలన్నిటినీ గమనించడానికి ఆ గట్టుమీదనుండే వెళ్లాలి పని వాళ్లకు కూడా అదేదారి ఆ ఛెట్టు క్రమంగా పెరిగి పెద్దదయింది. దానికొమ్మలు వచ్చే, పోయే వాళ్ల తలలకు తగులుతూ ఉండడం చూచి, అతనికి ఆ చెట్టు కొట్టి వెయ్యాలనే సంకల్పం కలిగింది ఆ చెట్టుపైని గూడుకట్టుకొని, ఒక ఏట్రింత పక్షి, తన పిల్లలతో కూడా అందులో నివసిస్తున్నది అది, సూర్యోదయం కాగానే ఆహారానికి బయలుదేరి సాయంత్రానికి గూడు చేరుకుంటుంది వచ్చేటప్పుడు పిల్లలకు ఆహారం కూడా తెస్తుంది

అక్కడ ఆనాడు ఏమి జరిగినదీ తన పిల్లలను అడిగి తెలుసుకుంటుంది

ఒకనాడు కర్షకుడు "ఈ చెట్టు కొట్టివెయ్యండి" అని తన సేవకులతో చెప్తూ వుండగా విని, అవి తమ తల్లికి చెప్తూ "మనం మరో చోటికి పోదాం" అన్నవి. "రేపటికి భయంలేదు పనివాళ్ళు దీన్ని కొట్టరు" అన్నది. అలాగే జరిగింది. తర్వాత ఆ యజమాని తన కొడుకులను పిలిచి" పనివాళ్ళు నామాట పట్టించుకోలేదు మీరే యీ చెట్టును కొట్టి వెయ్యండి" అని చెప్పాడు పక్షి పిల్లలు ఆ మాటను తల్లికి చెప్పాయి. తల్లి పక్షి "ఇంకామనం ఇక్కడ ఉండవచ్చు వాళ్ళు కూడా చెట్టును కొట్టివెయ్యరు" అని చెప్పింది. కర్షకుని పుత్రులు కూడా చెట్టును కొట్టడానికి శ్రద్ధ చూపలేదు ఇది చూచి ఆ భూస్వామి ఇతరులను నమ్మి లాభంలేదు రేపు నేనే దీనిని కొట్టివేస్తాను" అని అంటూ వుండగా పక్షిపిల్లలు విని తల్లితో ఆ సంగతి చెప్పాయి. "ఇతరులపై ఆధారపడక, అతడు స్వయంగా వచ్చి ఈ చెట్టును కొట్టదలచినపుడు, ఆ పని జరిగితీరుతుంది. రండి, మనం మరొక చోటికి పోదాం" అని అది, పిల్లలతో మరొక చోటికి వెళ్లిపోయింది

ఎవరైనా స్వంతంగా పని చేసుకుంటేనే ఆ పని జరుగుతుంది ఇతరులపై ఆధారపడితే, ఆ పని జరగడం దుర్లభం

**–బులుసు వేంకటరమణయ్య.**

భర్త ఆదర్శంవల్ల, ఉన్నతమైన వ్యక్తిత్వంవల్ల నా గుండెలపై భారం తీరిపోయింది ఈ కాలంలో అందరూ ఆదర్శాలువల్లె వేశేవారే కానీ ఆచరణలో చూపించేవారు బహు కొద్ది మంది మాత్రమేనమ్మా ఆ కొద్దిమందిలో నీ భర్త ప్రప్రథముడమ్మా అతనలా అంటుంటె అతని మంచి తనానికి నా కళ్లలో నీళ్ళు తిరిగాయి అంటూ ఆమెను తన హృదయానికి చేర్చుకుంటూ నా బంగారు తల్లీ ఏ బంగారు పుష్పాలతో భగవంతుని పూజించిందో ఉన్నతమైన వ్యక్తిని భర్తగా పొందింది" అనుకున్నాడాయన మనసులో

తండ్రి హృదయానికి తల ఆనించుకున్న ఆశ మనసు ఆనంద తరంగిణే అయింది

శేఖర్‌ని ఎంత తప్పుగా అర్థం చేసుకున్నాను

## ఆదర్శం

నాన్న చెప్పినట్లు అతను ఎంత ఆదర్శప్రాయమైన వ్యక్తి అటువంటి భర్త దొరకడం నిజంగా తన అదృష్టం' అనుకుంటూ లేచింది

ఆమె మనసు ఎంత త్వరగా శేఖర్‌ను చూద్దామా అని త్వరపడసాగింది తొమ్మిది అవుతుండగా శేఖర్ వచ్చాడు స్కూటర్ శబ్దమవగానే పరుగెత్తుకెళ్లి అతని హృదయంపై వాలి నిన్నటినుంచి తను పడిన వేదనంతా మరచిపోవాలని ఆరాటపడింది కానీ అక్కడ తల్లి, తండ్రి, చెల్లెలు ఉండటంతో ఆపని చేయలేక పోయింది శేఖర్ వస్తూనే ఆశ ముఖంలోని నిన్నటి ఆవేదన మాయమయి ఇప్పటి సంతోషాన్ని, తృప్తిని గ్రహించి సంతృప్తిగా తనలోనే నవ్వుకున్నాడు ఉదయం ఆశ ముఖాన్ని చూసి సాయంత్రం తప్పకుండ తను ఈ ఇంటికి వస్తుందని, అంచనావేసి తను సరాసరి బ్యాంక్‌నుంచి సరాసరి ఒక ఫ్రెండ్ దగ్గరికి వెళ్లి తొమ్మిది అవుతుండగా ఇలావచ్చాడు ఇప్పటి ఆశ ముఖంలోని వెలుగుల్ని చూసి సంతోషించాడు శేఖర్

వారిద్దరినీ అక్కడే భోంచేసి వెళ్లాలని పార్వతీశంగారు పట్టుపట్టడంతో భోజనం ముగించుకున్నారు

స్కూటర్‌పై తిరిగి ఇంటికి బయలుదేరారిద్దరూ ఆ చల్లని నిశీధిలో అతని నడుము చుట్టూ చేతులు బిగించి తృప్తిగా తేలికబడ్డ మనసుతో అతని వీపుపై తల ఆన్చింది ఆశ 




### డి.వి.వి.ఎస్.సి.– యలమంచిలి

నా వయస్సు 19 సంవత్సరములు 3 4 నెలలుగా తలలో వెంట్రుకలు పూడిపోవుచున్నవి తలలో పొలుసులాగ కట్టినది అప్పటి నుండి జుట్టు పూడిపోవుచున్నది తల దురదగా వుంటుంది పేలులేవు బి 12 ఇంజక్షన్‌లు చేయించుకున్నాను

★ తలను వారానికి మూడుసార్లు "సెల్‌సన్" అనే షాంపూతో బాగా నానిన తర్వాత కడిగివేయండి

లోనికి ఫల్విన్–ఎం మాత్రలను పూటకి 2 వంతున రోజుకి మూడు పూటలుగా వరుసగా 10 రోజులు వాడండి అలాగే మల్టీ విటమిన్ మాత్రలు వాడటంవల్ల ఆరోగ్య పరిస్థితి మెరుగు పడుతుంది

### టి. యం. మారాంపల్లి

మొన్నీ మధ్య కొత్త నైలాన్ సాక్స్ వాడుతున్నప్పటినుండి కాళ్ళు దురదపెడుతూ పై చర్మం పొట్టు పొట్టుగా ఊడిపోతున్నది ఇంతకు ముందు నైలాన్ సాక్స్ వాడినా ఇలా కాలేదు

అలర్జీవల్ల ఇలా జరుగుతుంది ఒక్కొరకం నైలాన్ సాక్స్‌కి మాత్రమే ఒకే వ్యక్తిలో అలర్జీ ఏర్పడే అవకాశం ఉంది

పై పూతగా బెట్‌నవేట్ స్కిన్ ఆయింట్‌మెంట్ వాడండి

### వి. ఎస్. డి – పెనుగొండ

మా అత్తయ్య వయస్సు 50 సంవత్సరములు ఎల్లవేళలా వూపిరి సలపనంత ఆయాసంగా వుంటుంది ఎన్ని మందులు వాడినా తగ్గుటలేదు దీనిని నివారించే మందు ఏదైనా ఉందా?

★ హృద్రోగాలుగాని, ఊపిరి తిత్తుల రోగాలుగాని, కడుపు బాగా ఉబ్బరంగా ఉండటంగాని, రక్తపుపోటు మొదలయినవాటివల్ల హృదయంలోను ఊపిరి తిత్తులలోను జరిగే మార్పులుగాని ఆయాసానికి కొన్ని కారణాలవుతాయి

వైద్యులు రోగిని పరీక్షించి కొన్ని ఇన్‌వెస్టిగేషన్‌లు చేసి రోగ నిర్ధారణ చేస్తారు దాన్ని బట్టి చికిత్స చేయవలసి ఉంది

### పి. డి – కడప

నాకు వివాహం అయి 3 సం లు అయినది రతి కార్యంలో పాల్గొన్న తర్వాత వీర్యము లోపలికి పోక యోని బహిర్భాగములోనే ఉంటున్నది ఇలా ఎందుకు జరుగుతుంది

★ లోపలికి పోక బహిర్భాగంలో ఉండటంకాదు. లోన వదలబడిన వీర్యం బయటికి వచ్చి ఉంటుంది ఇది చాలా సహజమే!

దీనివల్ల పిల్లలు పుట్టక పోవటమంటూ జరుగదు వీర్యంలో కొన్ని లక్షల వీర్య కణాలుంటాయి బాగా కదలిక ఉన్న ఒక్క వీర్యపు కణం చాలు – పిండోత్పత్తి జరగటానికి 




(గత సంచిక తరువాయి)

"అనితా నువ్వా ఏమిటి? ఎందుకు ఫోన్ చేశావు? ఆందోళనగా అడిగాడు విజయ్

కాలేజి నుండి అనిత అతడికి ఫోన్‌చెయ్య లేదింత వరకు అందుకే అతడు కంగారు పడ్డాడు

భయపడకండి "నవ్వి మీరు సాయంత్రం తొందరగా ఇంటికి రావాలి అంది అనిత

పనేమైనా వుందా?"

"పని కాదు మిమ్మల్ని మా అత్తయ్యకు చూపించాలి" అతడి గురించి రత్నమ్మ మాట్లాడిన మాటల గుర్తొచ్చి బాధగా అంది అనిత అయితే ఫోన్‌లో అతడికా మాటలన్నీ చెప్పాలనుకోలేదు

రమేష్ వాళ్లమ్మ ఒంట్లో బాగా లేదని వచ్చింది రమేష్ కాలేజికి వచ్చి నన్ను వాళ్లింటికి తీసుకెళ్లాడు"

రమేష్ వాళ్ళింటికి వెళ్ళొచ్చావా?" విజయ్ స్వరంలో తీవ్రత కనిపించగానే అనిత నిటారుగా ఆయింది

రమేష్ రత్నమ్మల మాటలు నిజం అనుకోడానికి అదే ప్రత్యక్ష సాక్ష్యం అనిపించింది

ఏం వెళ్ళగూడదా?' ఆమెకు తెలియకుండానే గొంతు కోపంగా పలికిరిది

'వెళ్ళగూడదని నేననడం లేదు 'అతడేదో చెప్పాలను కొని చెప్పలేని వాడిలా అన్నాడు

'మరి "

ఏమిటంత కోపంగా వున్నావు? ఏంజరిగింది? మాట మారుస్తూ అన్నాడు విజయ్

అనిత మనసు ఆమాటతో చల్లబడి పోయింది

'తన మనసు బాగోలేక అతడి మాటలను మరోలా అర్థం చేసుకున్నదేమో!' చిరాకును దూరం చేసుకొనే ప్రయత్నం చేస్తూ విజయ్ ఇంతకీ నేను చెప్పిన విషయం గుర్తుంది గదూ " అంది

**జరిగిన కథ–5 :** అనితకు ఆ రోజు శుభప్రదమైన రోజు, భర్త విజయ్ రాకకై ఎదురు చూస్తున్న అనితకు రమేష్ రాక నిరాశ కలిగించింది 'ప్రముఖ రచయిత్రి అనితాదేవి అసలు రూపం' అంటూ ఎవరో పేపర్లో వేయిస్తే ఆ పని విజయే చేసి ఉంటాడని అతడిని నిలదీసి అడుగుతుంది అనిత విజయ్‌కు మొదట పరిచయమైన అనిత గుర్తుకు వస్తుంది – అనిత ఆహ్వానంపై ఆమె ఇంటికి వెళ్లిన విజయ్ ఆమె వితంతువని తెలుసు కొంటాడు అనిత, విజయ్‌ల స్నేహం బలపడసాగింది అనిత, విజయ్‌ల పెళ్లి జరిగి పోయింది అనిత, విజయ్ మేరేజ్‌కి వచ్చిన రమేష్ మాటలు అందరికీ చికాకును కలిగిస్తాయి కాని అతని మాట లేవీ అనిత వినలేదు రమేష్ అనితను తీసుకు రావడానికి విజయ్ ఇంటికి వెళతానంటే ప్రసాదరావు వద్దంటాడు విజయ్‌ని తీసుకొని అత్త వాళ్లింటికి వెళ్లాలను కుంటుంది అనిత

ఏమిటి ' ఆలోచిస్తున్న వాడిలా అని ఆఁ నన్ను మీ అత్తయ్యకు చూపించాలన్నావుగదూ! అదేమిటి అనీ ఆమెకు నన్ను చూపించడం ఎందుకు? అన్నాడు ఆశ్చర్యంగా

మంచికి ప్రతిరూపమని "

"అలా అని ఆమెకు చెప్పావా? నవ్వాడు విజయ్

"ఊహుఁ మిమ్మల్ని చూసి తెలుసుకుంటుంది మరిచి పోకుండా మీరు సాయంత్రం

"సారీ డియర్ సాయంత్రం నాకు చాలా ముఖ్యమైన పని వుంది రాలేను" నెమ్మదిగా చెప్పాడు విజయ్

"మరి మొదటే ఆమాట చెప్పొచ్చుగా అంది అనిత రుసరుస లాడుతూ

"చెప్పేస్తే ఫోన్ పెట్టేస్తావు నీతో కాసేపు మాట్లాడాలని పించింది

అనిత ఫోన్ పెట్టేసింది

'రమేష్ వాళ్ళింటికి ఇష్టంలేకే అతడలా పనున్నదంటూ తప్పించుకున్నాడు అనితలో అనుమానం అతడి మీద కోపం పెంచుతోంది

'రమేష్ తనతో మాట్లాడడం అతడికి ఇష్టం లేదనడం అబద్ధంకాదు ఆ మాట తనతో చెప్పలేక పోయాడు రమేష్‌కు ప్రవర్తన ద్వారా తెలియచేశాడు ఎందుకలా? విజయ్ తనను అనుమానిస్తున్నాడా?' అనితకు కాలేజిలో వుండాలని పించలేదు సెలవు పెట్టి ఇంటికి వచ్చింది

తండ్రి దగ్గరికి వెళ్లి విజయ్ ఏం చెప్పాడో తెలుసుకోవాలను కుంది కాని 'అతడు చెప్పాలనుకుంటే ఎప్పుడో చెప్పేవాడు తను బాధ పడుతుందని చెప్పలేదేమో! తను ఆ మాటేమిటో తెలుసుకొని బాధపడుతుంటే అతడు చూడలేడు ' తండ్రిని బాధపెట్టడం ఇష్టంలేక అతడి దగ్గరికి వెళ్ళే ప్రయత్నం విరమించుకుంది

'తనారోజు విజయ్‌ను పిలుచు కెళ్ళకపోతే అత్తయ్య రమేష్‌లకు విజయ్ గురించి వాళ్ళన్న మాటలు నిజమేనని చెప్పినట్లవుతుంది విజయ్ తనను అనుమా నిస్తున్నాడని వాళ్ళు అనుకోగూడదు ' అనితకేం చెయ్యాలో తోచడంలేదు విజయ్‌కు మళ్లీ ఫోన్‌చేసి రమ్మనాలంటే అభిమానం అడ్డు-వస్తోంది

'తను వెళితే వాళ్ళకు తన గురించి ఏ ఆలోచనా రాదు విజయ్ పనుండి రాలేక పోయాడంటే ఏమంటారు?' అనుకుంది

సాయంత్రం రమేష్ ఇంటికి వెళ్లింది

"విజయ్ రానన్నాడు గదూ!' ఆమె విచార వదనం, విజయ్ రాకపోవడం చూసి అన్నాడు రమేష్

"రాగూడదని కాదు రమేష్ పనుండి తను నమ్మలేని విషయాన్ని గట్టిగా చెప్పలేకపోతోంది అనిత ఆ మాటల్లో తడబాటు రమేష్‌కు ఆమె హృదయాన్ని విప్పి చూపించినట్లయింది

అనిత – విజయ్‌ను అనుమానిస్తుందని అతడనుకోలేదు

'అలా జరిగిందంటే అనిత తననిక తేలిక భావంతో చూడదు ' అతడికి సంతోషంగా వుంది

"పని వున్నా లేకున్నా అతడు రాడు ఆ విషయం నాకు తెలుసు " విజయ్ రాడని తను ముందే వూహించినట్టుగా అన్నాడు

అతడి మాటలకేం జవాబు చెప్పలేదు అనిత

"అతడి కిష్టం లేదంటే నీవు రావడం గూడా మంచిది కాదమ్మా " అంది రత్నమ్మ

'నా వాళ్ళను నేను చూసేందుకు అతడి ఇష్టా ఇష్టాలతో పనేమిటి?" అతడి మాటను లెక్క పెట్టనన్నట్లుగా అంది అనిత

"విజయ్, నిన్నిలా బాధిస్తాడనుకోలేదు కీర్తి కిరీటంకోసం అతడు నిన్ను పెండ్లి చేసుకున్నట్లున్నాడు మనసు అతడిమాట వినడంలేదు రెండో పెండ్లి

చేసుకున్న స్త్రీ నిశ్చల మనస్కురాలిగా వుండదను కుంటున్నాడేమో ..." రమేష్ మాట్లాడుతుంటే మౌనంగా వింటోంది

ఆమె మనసు మారకుండా వుంటే అతడి మాటలకు మండిపడి అక్కడినుండి లేచి వచ్చేది కాని మనసులో పురుగులా ప్రవేశించిన అనుమానం అతడి మాటలు నిజమనుకొనేలా చేసింది

"నీవు అతడ్ని ప్రేమిస్తున్నావు ఆరాధిస్తున్నావు కాని అతడు నీ మనసు తెలుసుకోలేక పోతున్నాడు " రమేష్ మాటలు ఆవేదనను దాచుకో నివ్వడం లేదు. కన్నీరై ప్రవహిస్తోంది



'ఊరుకోమ్మా బాధపడకు " రత్నమ్మ ఓదార్పు బాధ నధికం చెయ్యగా తను వచ్చిన కారణమే మరిచింది అనిత

విజయ్ తనను అనుమానిస్తున్నాడని వాళ్ళు అనుకోగూడదనుకుంది కాని దుఃఖం, బాధ వాళ్ళకా విషయాన్ని చెప్పలేకనే చెప్పాయి

అనిత వచ్చేసరికి విజయ్ ఇంట్లో వున్నాడు.

"ఎక్కడికి వెళ్లావు?" అరగంట క్రిందట ఇంటికి వచ్చిన అతడికి ఇంట్లో ఒంటరిగా వుండడం విసుగనిపించి భార్య రాగానే అడిగాడు

"రమేష్ వాళ్లింటికి " అతడివైపు చూడకుండా అంది అనిత

"మధ్యాహ్నం వెళ్లానన్నావే"

"వెళ్లాను అయితే ఏం? ఇప్పుడు వెళ్లగూడదా?" తల తిప్పి అతడివైపు చురుగ్గాచూసింది

**విజయ్ క్షణం మాట్లాడకుండా మౌనంగా చూశాడు.**

**"అనితా, ఏమయింది? ఎందుకలా మాట్లాడుతున్నావు?" తను రమేష్ వాళ్ళింటికి రానందుకే అయితే అంత కోపంగా వుండదని అతడికి తెలుసు.**

**"ఏం కాలేదు. ఏదో అయిందని మీరు అనుకుంటున్నారు...." అంటూ చర చరపైకి వెళ్లింది అనిత.**

**విజయ్ ఆశ్చర్యంగా చూశాడు. 'అనిత ఎందుకలా వుంది?' ఎంత ఆలోచించినా అతడికి అర్థం కాలేదు.**

కొద్ది సేపయ్యాకపైకి వచ్చాడు.

అనిత దుస్తులు గూడా మార్చుకోలేదు. కంళ్ళకు చెయ్యి అడ్డుపెట్టుకొని వుంది. ఆమె ప్రక్కన మంచం మీదే పర్సు విసిరి పడేసినట్టుగా వుంది. అది చూడగానే ఆమె ఎందుకో బాధపడుతోందనుకున్నాడు విజయ్.

"అనీ . " ఆమె దగ్గరకు వచ్చాడు

అనిత పలకలేదు కదల్లేదు.

విజయ్ కంళ్ళకు అడ్డుగా వున్న ఆమె చేతిని తీశాడు.

వుబికుబికి వస్తున్న కన్నీళ్ళు ప్రక్కగుండా జారిపోతున్నాయి.

"అనితా.. " చూడలేని వాడిలా రెండు చేతులతో కన్నీళ్ళు తుడిచాడు.

"రమేష్ ఏమైనా అన్నాడా?" ఆమె ముఖంలోకి చూస్తూ అడిగాడు అంతవరకు అతడి ఆప్యాయతకు కరిగిపోయిన అనిత అతడా మాట అనగానే ఆగ్రహంగా చూసింది

"రమేష్ అంటే మీ కెందుకంత కోపం?"

"అతడి తత్వం నాకు నచ్చలేదని నీ కిదివరకే చెప్పాను " విజయ్ స్వరం అనుకోకుండానే గంభీరంగా మారిపోయింది.

"అతడు మీకేం ద్రోహం చేశాడని మీకు నచ్చలేదు?" అనితలో కోపం ఏమాత్రం తగ్గలేదు

"చెయ్యలేదు. చెయ్యాలను కుంటున్నాడని తెలుసు."

"విజయ్...." స్థాణువైపోయింది అనిత.

'తనను అతడు అనుమానిస్తున్నాడని తెలుసు కొనేందుకు ఇంతకన్నా ఏం కావాలి? తనమీద నమ్మకం వుంటే అతడు రమేష్ గురించి ఆలోచించే వాడుకాదు '

"అతడితో మాట్లాడడం అతడి ఇంటికి వెళ్లడం పాముతో స్నేహం చెయ్యడం లాంటిది." అన్నాడు విజయ్.

"మీ అనుమానం మిమ్మల్ని అలా అనుకొనేట్లు చేస్తోంది "

"కాదు అనీ అతడు "

"ఆపండి." గర్జించినట్లే అంది "ఎందుకు అతడ్ని అలా అంటారు? నామీద అనుమానంతో అతడ్ని దూరం వుంచాలనుకుంటున్నానని చెప్పండి."

"అనితా " అవాక్కయ్యాడు విజయ్.

"మా బంధుత్వం మీకు మామీద అనుమానం కలిగిస్తోంది "

'ఎవరు? ఎవరన్నారలా? ఆ రమేషే గదూ!" అతడి కండ్లు ఎర్రబడ్డాయి పళ్ళు పట పట మన్నాయి

"ఏం, వున్నమాట అన్నాడని కోపమా?" అంది అనిత నిర్లక్ష్యంగా

"వున్నమాట .." విరక్తిగా నవ్వాడు.

"కాదు. అతడు అతడి మనసును మాటలతో బైటపెట్టుకున్నాడు అతడు నీ జీవితంలో చిచ్చు పెట్టాలనుకుంటున్నాడు... " ఆ సమయంలో రమేష్ ఎదురుగా వుంటే ఏం చేసేవాడో ననిపిస్తోంది అతడి వుగ్రరూపం చూస్తుంటే.

"అది మీ వూహ.. "

"లేదు అనిత అతడి అంతరంగం తెలిసే అంటున్నాను. అతడు నీ వ్రేలితో నే నీ కండ్లు పొడవాలనుకుంటున్నాడు."

"విజయ్ మీ మాటలతో నన్ను మభ్యపెట్టలేరు. మీ మనసుకు తెరవేసుకో లేరు నన్ను నమ్మలేకపోతున్నారు మీరు. రెండో పెండ్లి చేసుకున్నాను కాబట్టి దేనికైనా సిద్ధపడతా ననుకున్నారు ." '

"అనితా. " విజయ్ చెయ్యి పైకి లేచింది

"నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలుసా?" ఆమె వైపు చూడగానే వివేకం మేల్కొన్నట్టుంది. చెయ్యి క్రిందికి దించేశాడు

"అర్థంలేని అనుమానాలతో నన్ను నీచుడ్ని చెయ్యకు." వేడికోలుగా అన్నాడు.

"ఆ పని చేస్తున్నది మీరు. నన్ను నా వాళ్ళలో అవమాన పడేట్లు చేశారు." అనిత కండ్లలో నీళ్ళు తిరిగాయి.

"వాళ్ళింటికి వెళ్ళడం నీ తప్పు "

"బంధువులకు ఒంట్లో బాగా లేదంటే చూసేందుకు వెళ్ళడం తప్పా?" విప్పారిత నేత్రాలతో చూసింది అనిత

"వాళ్ళు అవమానకరంగా మాట్లాడతారన్న అనుమానం వుంటే వెళ్లగూడదు."

"మీరెందుకే రాలేదా?" అంది అనిత.

"అనితా. ..." ఎలా చెప్పాలో తెలియని వాడిలా అన్నాడు.

"వాళ్ళేదో అన్నారని నీవు బాధపడుతుంటే అన్నాను కాని నేనా వుద్దేశ్యంతో కాదు పనుండే రాలేక పోయాను "

"మిమ్మల్ని మీరు సమర్థించుకొనే మాటలవి." నిరసనగా అన్న అనిత మాటలు అతడిలో సహనాన్ని నశింప చేశాయి

"సమర్థించు కోడమా? ఎందుకు? రమేష్ అంటే నాకు అభిమానం లేదు. అతడి బుద్ధి తెలిశాక అతడ్ని దూరం వుంచడమే మంచిదను కున్నాను. కాని నువ్వు...... కావల్సిన వాళ్ళంటూ వెళ్ళి వాళ్ళ బోధలతో నన్ను నీవు మరిచి మాట్లాడు తున్నావు. ..." అంటూ బైటికి వచ్చాడు.

తను రమేష్ వాళ్ళింటికి రాలేదని బాధపడుతోందను కున్నాడు. కాని అనిత తను ఆమెను అనుమానిస్తున్నాడనుకుంటోంది. తన కంపెనీలో షేర్లు తీసుకున్న వ్యక్తులు మాట్లాడేందుకు వస్తాననడంవల్ల తను సాయంత్రం రమేష్ వాళ్ళింటికి రానన్నాడు. అనిత అపార్థం చేసుకుంటుందన్న అనుమానమే వుంటే ఆ మీటింగ్‌ను మరో గంటకు వాయిదావేసి వచ్చేవాడు. కొత్త కొత్త ఆలోచన్లు వస్తున్నాయి అనితకు. రమేష్ అతడి తల్లి పాలకుండలో విషపు చుక్క చిలికినట్టుగా ఆమె మనసును మార్చారు. ఎంత చదివినా ఏం చేసినా చెడును తొందరగా నమ్ముతాడు మనిషి. అనిత మానవా తీతురాలు కాదు.' విజయ్ అశాంతిగా బాల్కనీలో కూర్చున్నాడు.

**భోజనంచేసి భార్యతో కబుర్లు చెబుతూ ఆనందంగా గడిపే సమయం అది అనిత అనుమానంతో ఆ సమయాన్ని దుర్భరం చేసింది.**

**'ఆమె తన నిలాగే అనుమానిస్తే తమ బ్రతుకుల్లో శాంతి వుండదు.. .' అది భరించలేని వాడిలా మళ్ళీ అనిత దగ్గరికి వచ్చాడు.**

**"అనితా రమేష్ వాళ్ళు అవమానకరంగా మాట్లాడారంటే వాళ్ళ మనసులు నీకు తెలియడం లేదూ?" విజయ్ మాటలు వినగానే గోడవైపు తిరిగి పడుకొని వున్న అనిత అతడి వైపు తిరిగింది.**

"వాళ్ళ మనసులేమో కాని మీమనసు బాగా తెలిసింది."

"నన్ని రోజే కొత్తగా చూస్తున్నావా?"

"మీ మనసు తెలిశాక మీరు కొత్తగానే కనిపిస్తున్నారు. ఇన్నాళ్ళు నన్ను గుండెలో దాచుకొని ప్రేమిస్తున్న గొప్పవ్యక్తి అనుకున్నాను. కాని అనుమానంతో రగులుతూ నన్ను అవమాన పరచాలనుకున్నారు." చివరి మాట అంటుండగా ఆమె గొంతు గాద్గదిగ మయింది.

"రమేష్ మాటలు తల కెక్కిన నీకు నేనేం చెప్పినా అర్థంకాదు." అక్కడేమంటే ఆమె మాటలకు రెచ్చిపోయి ఏం మాట్లాడతానోనని ప్రక్క గదిలోకి వచ్చాడు విజయ్

'ఇన్నాళ్ళుగా తనతో కాపురం చేస్తున్న అనిత తన నర్మం చేసుకోలేదు. బాధగా వుందతడికి.

'రమేష్ ఆమె బంధువు. అతడు అబద్ధం చెప్పడనుకుంటోంది. అతడు ఆమెను పెండ్లి చేసుకోలేనని కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పడమే ఆమె నమ్మకానికి కారణం. తనేం చెప్పినా వినే స్థితిలో లేదు. ఏంచెయ్యాలిప్పుడు?' వడుకొని ఆలోచిస్తున్నాడు.

* * * * *

తను రమేష్ ఇంటికి వెళ్ళడం ఇష్టంలేదని విజయ్ స్వయంగా చెప్పాక అతడి ఇంటికి వెళ్ళేందుకు భయంగా వుంది కాని వెళ్ళకపోతే తను విజయ్ బిగించిన చక్రంలో వుందని అతడు అనుకుంటాడని కాలేజి వదలగానే వాళ్ళింటికి వెళ్ళింది అనిత

ఒక్క రోజులో నే జబ్బును పడిన దానిలా అయింది అనిత.

"ఏమిటలా వున్నావు? నిన్న మా ఇంటికి వచ్చినందుకు విజయ్ కోప్పడ్డాడా?" అడిగాడు రమేష్

'ఏమిటి ఇతడు అన్ని విషయాలు తెలిసినట్లే మాట్లాడుతున్నాడు... ఆశ్చర్యంగా వున్న ఆమె చూపులే అతడికి జరిగిన దాన్ని తెలిపాయి.

"మరి ఈ రోజెందుకు వచ్చావు అనితా " బాధ ధ్వనిస్తున్న గొంతుకతో అన్నాడు రమేష్

అక్కడ ప్రసాదరావు కూడా వున్నాడప్పుడు.

"విజయ్ కోప్పడడమా. .' నమ్మలేని వాడిలా కూతురివైపు చూశాడు. "ఏమ్మా, ఒంట్లో బాగా లేదా?"

"ఏం లేదు నాన్నా బాగానే వున్నాను." అంటూ రత్నమ్మ దగ్గరికి వచ్చింది అనిత

"అయిన వాళ్లం, కాదనుకున్నా రక్త సంబంధం ప్రేమను చావనివ్వదు అందుకే భర్తకిష్టంలేకున్నా నన్ను చూసేందుకు వస్తున్నావు" రత్నమ్మ అనిత చేతిని తన చేతుల్లోకి తీసుకొని అంది. ఆమె అనిత విషయంలో ఇది వరకెలా ఆలోచించినా ఇప్పుడు ఆమె భర్త మాట వినకుండా తన కోసం వచ్చిందంటే బాధ పడుతోంది.

"అతడ్ని కాదని బ్రతుకు భారం చేసుకోకమ్మా" అంటూ చెప్పింది.

ప్రసాదరావుకు ఆమె మాటలు వింటోంటే అయోమయంగా వుంది. 'అనితను రమేష్ వాళ్ళింటికి వస్తే విజయ్ కోప్పడడమా? ఎందుకు? చెల్లెలు, రమేష్, కూతురి మీద సానుభూతి చూపించడం భరించలేక పోతున్నాడు.

"అనితా మనం వెళ్దామా?" ఇంకా అక్కడే వుంటే వాళ్ల మాటలతో ఆమె మరింత నీరసించి పోతుందేమోనని కొద్ది సేపయ్యాక అన్నాడు ప్రసాదరావు

"అనిత కాలేజి నుండి ఇటే వచ్చింది. కాసేపు విశ్రాంతి తీసుకోనివ్వు మామయ్యా .." అంటూ రమేష్ ముఖం కడుక్కొనేందుకు వెళుతుండగా గదిలో నుండి రత్నమ్మ కేక వినిపించింది

రమేష్ పరుగున వచ్చాడక్కడికి

రత్నమ్మ గుండె చేత్తో పట్టుకుని వుండలా పడుకొని నొప్పినాపుకో ప్రయత్నిస్తూ పళ్ళు బిగ పట్టింది.

రమేష్ ఆమెకే సమయంలో అవసరం అవుతుందోనని ముందుగానే ఆమెకు అవసరం అనిపించిన మందులు ఆ గదిలో నే పెట్టాడు. గదిలోకి రాగానే తల్లిని పరీక్ష చేసి ఇంజక్షన్ ఇచ్చాడు కొద్ది సేపటి తర్వాత తేరుకున్నా ఆమె బాగా అలిసినట్లుగా వుంది

ఆమెకుఊరు నుండి వచ్చాక నొప్పి వచ్చిందప్పుడే

రమేష్ ఆమె వంక దిగులుగా చూస్తున్నాడు.

ప్రసాదరావు, అనిత ఆమె ప్రక్కనే కూర్చున్నారు

అకస్మాత్తుగా ఆ ఇంట్లో అతి నిశ్శబ్దం ఏర్పడింది. ఆ నిశ్శబ్దం వెనుక భయం.

రత్నమ్మ కోలు కుంటుందన్న నమ్మకం కలగడం లేదవరికీ. ఆ నొప్పి అంత భయంకరంగా వచ్చింది ప్రాణాన్నే నలిపివేసినట్లుగా నలిగి వుంది రత్నమ్మ

చీమ చిటుక్కుమన్నా వినిపించేంత నిశ్శబ్దంలో ఫోన్ మోత పెద్ద శబ్దంలా వినిపించింది

రమేష్ వెళ్ళి ఫోన్ ఎత్తి మరుక్షణమే వచ్చాడు "అనితా, నీకే ఫోన్, విజయ్ చేశాడు "

తల్లి ఆరోగ్యం భ్రమాందోళనలు కలిగించకుండా వున్నట్లయితే మాట్లాడుతున్నది విజయ్ అని తెలిసి మాట్లాడకుండా వచ్చేవాడు కాదు " అనిత మా ఇంటికి వచ్చిందని కోపమా?" అని అడిగేవాడు. అతడెప్పుడైనా కనిపిస్తే ఆ మాట అడగాలనుకున్నాడు తల్లి గురించిన ఆలోచనతో అతడితో మాట్లాడే అవకాశం వచ్చినా ఆ విషయం మరిచాడు

అనిత వెళ్ళి రిసీవర్ తీసుకుంది

ప్రసాదరావుకు అల్లుడితో మాట్లాడాలని వున్నా చెల్లెల్ని చూస్తూ అక్కడి నుండి కదల్లేక పోయాడు

అనితకు విజయ్ మాట్లాడుతున్నాడనగానే ప్రాణం లేచి వచ్చినట్లయింది.

'రాత్రి నుండి మాట్లాడక పోతే అతడికీ బాధగా వున్నట్లుంది. తను అతడ్ని తప్పుగా అర్థం చేసుకున్నదేమో!" ఆలోచిస్తున్న అనిత "హలో ..." ఎంతో సేపుగా ఎదురు చూస్తున్నట్లుగా వినిపించిన విజయ్ స్వరం విని వులిక్కి పడింది.

"హలో అనితనే మాట్లాడుతున్నాను..." ఆనందాన్ని అదుపులో వుంచుకుంటూ అంది.

"నేను అర్జంట్‌పనిమీద మద్రాసు వెళుతున్నాను నాలుగు రోజుల వరకు రాను. అది చెప్పాలనే ఫోన్ చేశాను" అంటూ ఫోన్ పెట్టేశాడు విజయ్.

అనిత రిసీవర్ పెట్టి బొమ్మలా అక్కడే నిల్చుంది కొద్ది సేపు

'విజయ్ మాటల్లో అనురాగం లేదు ఆత్మీయత లేదు. క్యాంపుకు వెళుతున్నట్లు తెలియ చెయ్యాలని తప్ప తనతో మాట్లాడాలన్న ఆసక్తి కనిపించలేదు. తనేం తప్పు చేసిందని అతడి కంత కోపం? తనతో మాట్లాడడం ఇష్టం లేదంటే ఆ విషయం కూడా ఎందుకు చెప్పడం? నాయర్‌కు చెప్పి వెళ్ళి వుంటే సరిపోయేది' కోపంగా అనుకుంది కాని తండ్రి "ఎందుకమ్మా ఫోన్ చేశాడు?" అని ఆత్రంగా అడిగితే తనలో భావాలు బయల్పడకుండా "క్యాంపుకు వెళుతున్నారట. అది చెప్పేందుకు " అంది.

* * * *

"తను అనుకున్నట్లుగా ఆ రోజు మద్రాసు వెళ్ళి వుంటే తనకీనాడు ఈ బాధ వుండేది కాదు. ' విజయ్ పడక్కుర్చీలో పడుకొని నింగికేసి చూస్తున్నాడు.

'అనిత రమేష్ ఇంట్లో వుంటుందని తను అనుకున్నా రమేష్ నోట ఆ మాట వినగానే కోపం వచ్చింది. ఆమె తనను నమ్మలేదని బాధపడ్డాడు. కాని ఆమెను అనుమానించలేదు అనితకు అది అర్థం కాలేదు ఆమె అనుకున్నదే . కాదు. కాదు. రమేష్ మాటలతో ఏర్పడిన అభిప్రాయమే నిజమనుకుంది. తన గుండెల్లో గునపాన్ని చెక్కింది ' అనిత మాటలు తలుచుకుంటే అతడి మనసు వికలమై పోతోంది

'అనిత ఎంత మూర్ఖంగా ప్రవర్తించింది....' విజయ్ కండ్ల ముందు కోపోద్రిక్తమైన అనిత రూపం కదిలిందొక్క క్షణం

### ఎన్.వి. ఆర్. వ్యాగ్రేస్వరం

మీకు దేముడు ప్రత్యక్షమై ఏమైనా వరం కోరు-కోమంటే ఏమి కోరుకుంటారు?

★ కాస్త వ్యవధి యివ్వమంటాను ముందు నా మనఘుని అడగాలి ఏంకావాలో

### టి. ఎస్. బి. హిందూపురం

నాకు అమ్మవారు పోసి ముఖంమీద గాయాలు పడి నల్లని మచ్చలు ఏర్పడ్డాయి

★ మీరు డాక్టరుగారికి రాయండి లేదా వూళ్లో ఎవరేనా స్కిన్‌స్పెషలిస్టుతో సంప్రదించండి నిరాశ-పడకండి ఈ రోజుల్లో వీటిని పోగొట్టడం పెద్ద సమస్యకాదు

### పి. వి. జె. ఔరంగాబాదు
### ఎ. ఆర్. ఎస్. పి. అనకాపల్లి,
### ఎస్. సిహెచ్. ఎం. ధర్మవరం,
### ఎమ్. వి. ఎస్. ఎన్. ఆర్. పి. పూనె.

28.9 84 సంచికలో దరిద్రనారాయణుడు గాంధి అని వ్యాఖ్యానించారు

★ ఈ విషయం మీద ఇంత బాధపడిపోయే




బదులు గాంధీజీ జీవిత చరిత్ర ఒకసారి తిరిగి చదవమని నా సలహా మధురలో ఆడంబర వస్త్ర-ధారణకి స్వస్తి పల్కిన గాంధి తనని తనే "దరిద్ర-నారాయణుడ"ని చెప్పుకొన్నాడు రౌండ్‌టేబిల్ కాన్ఫ-రెన్స్‌కి వెళ్ళినపుడు నాకు గాంధి అంటే గౌరవం వుంది ఖద్దరంటే గౌరవం వుంది దేశం అంటే అభిమానం వుంది కాని నేటి కుహనా నాయకులు దేశభక్తి కబుర్లమీద గౌరవం లేదు వాళ్ల ధన దాహం, కీర్తికండూతి అంటే–అధికార మదం అంటే అసహ్యం అందుకే– రిజర్వు బ్యాంకే కాదు– మేరు-పర్వతం ముందుంచినా దరిద్రనారాయణున్నను-కున్న గాంధీ–– కన్నెత్తి చూడడు కొట్వేయడు.. జై గాధి.

### ఎన్. ఆర్. ఒంగోలు

పుణ్యకార్యాలు, పతిపూజలు కుటుంబ విషయాలు వదిలేసి పేద్ద పాటకులను ఉద్ధరిస్తున్నట్లు పత్రికల సర్క్యులేషన్ పెంచడానికి ఇతోధికంగా సహాయం చేసే స్త్రీలపై మీ అభిప్రాయం?

★ అవన్ని చేసి ఆత్మ తృప్తికోసం యీ పని చేస్తూండి వుండవచ్చునని తోచనేలేదా మీకు?!

### టి. బి. ఎస్. నాగాయలంక

తినడానికి బ్రతుకుతున్నామా? బ్రతకడానికి తింటున్నామా?

★ రెండూ లేదు నూటికి నలభై మందికి పైగానే దొరుకుతున్నప్పుడే తినకల్గుతున్నారు!

### ఎల్. పి. ఆర్. విజయవాడ.

నేను ప్రతిదాన్లో జాగ్రత్తగా వుండాలను-కొంటాను ఉంటాను గాని ప్రతిది నేను అను-కున్నట్టు జరగడం లేదు దీనికి కారణం?

★ రూల్ ఆఫ్ ఛాన్సు – అది ఎవరి ఎత్తులనైనా తలకిందులు చేస్తుంటుంది అప్పుడప్పుడు □

## పసిడి బొమ్మ

ఆ రోజు అనిత ఇంటికి రాగానే విజయ్‌ను చూసి నిర్విణ్ణురాలయింది 'మద్రాసు వెళతానని అతడు ఇంట్లోనేవున్నాడంటే ' ఆమె మెదడు చురుగ్గా పని చేసింది

'తనను పరీక్ష చెయ్యాలనుకున్నాడు ' నిర్జీవంగా నవ్వుకొని "మీ పరీక్షలో ఏం తెలిసింది? అంది అతడి దెస చూసి

"పరీక్షా " ఆశ్చర్యంగా అన్నాడు

"తెలీనట్లు మాట్లాడకండి నాకు తెలుసు మీరు నన్ను పరీక్షించాలనే మద్రాసు వెళతానని ఫోన్ చేసి ఇంట్లో వున్నారు '

"అనితా "

"మీరు రమేష్‌ను చూసిన రోజే అతడి గురించి అయిష్టంగా మాట్లాడారు అది నా మీద అభిమానంతో అనుకున్నాను కాని అనుమానిస్తున్నారని గ్రహించలేక పోయాను "

'అనితా, ఎందుకిలా ప్రతి చిన్న విషయాన్ని అనుమాన దృక్కులతో చూసి ఆలోచిస్తున్నావు?" విసుగు ధ్వనిస్తున్న గొంతుకతో అన్నాడు

"నిన్ను అనుమానిస్తున్నానని ఎవరు చెప్పారు?'

"ఎవరూ చెప్పక్కర్లేదు మీ ప్రవర్తన చెబుతోంది మీ మాటలు చెబుతున్నాయి

"కాదు " ఆమె మాటల మధ్యలోనే అన్నాడు "నీ లో భావం చెబుతోంది " విజయ్ సోఫాలో నుండి లేచి ఆమె దగ్గరికి వచ్చాడు

"నేను అనని దాన్ని గురించి నీ వింతగా ఆలోచిస్తున్నావంటే నీకా ఆలోచన వుండి వుంటుంది "

"విజయ్ "

"నిన్ను నీవు నమ్మలేక నన్ను నిందిస్తున్నాను రమేష్ మాటలకు మంత్ర ముగ్ధవై నీ జీవితాన్ని నరకంలోకి త్రోసుకుంటున్నావు "

"విజయ్ " గట్టిగా అరిచింది.

"మీరలా మాట్లాడతారనుకోలేదు నేను .. " ఆవేశంతో వూగిపోతూ అంది "నేను రమేష్‌తో . ఛీఛీ, అనుకొనేందుకే అసహ్యంగా వుంది"

"అసహ్యించుకుంటున్న దాన్ని గురించి ఆలోచిస్తున్నావు నువ్వు"

'నేను ఆలోచించడం కాదు. మీరు ఆలోచించేలా చేస్తున్నారు. మీరు ప్రేమించానన్నారు పెండ్లి చేసుకుంటానన్నారు ఆలోచన లేకుండా తల వూపాను అందుకు ఫలితం అనుభవిస్తున్నాను కాని విజయ్ " అతడి కండ్లలోకి గ్రుచ్చి చూసింది

'మళ్లీ పెళ్లి చేసుకున్న ఆడదాని మనసు నిశ్చలతను కోల్పోతుందని అనుకోకండి తనకు బ్రతుకు నిచ్చిన వ్యక్తిని ఆరాధిస్తుంది అభిమానిస్తుంది అతడి కోసం అవసరమైతే బ్రతుకునే త్యాగం చేస్తుంది . "

విజయ్ చిన్నగా నవ్వి 'అన్నీ చేస్తుంది కాని అతడి మనసు అర్థం చేసుకోలేదుగదూ?" అని పైకి వెళుతూ ఆగి "నేను నీ నుండి ఆశించింది ఆరాధన కాదు త్యాగంకాదు అనురాగాన్ని అది కరువైనప్పుడు ఏది వున్నా వ్యర్థమే " అంటూ ఆమె వైపు చూశాడు

"నేను నిన్ను పరీక్ష చెయ్యాలనుకుంటే ఏ ఊరో వెళుతున్నానని నీ కోసం ఎదురుచూస్తూ ఇంట్లో కూర్చోనక్కర్లేదని తెలుసుకో నీకు ఫోన్‌చేసిన కొద్ది సేపటికే మద్రాసు నుండి ట్రంకాల్ వచ్చింది సరుకు రాలేదని, నన్ను నాలుగు రోజుల తర్వాత రమ్మని అందుకేమద్రాసు వెళ్లలేదు "

ఆమె అతడి మాటలు నమ్మలేదు "దొరికి పోయాక ఇటువంటి మాటలే చెబుతారు " అంటూ నిరసనగా చూసి అక్కడి నుండి వెళ్ళిపోయింది

'ఆ చూపులు తను మరవలేదు అవి తననెంత బాధించాయో అనితకు తెలియదు . ' ఆ జ్ఞాపకాల్ని భరించలేని వాడిలా తల ప్రక్కకు తిప్పుకున్నాడు.

'తను మద్రాసు ప్రయాణం ఆగిపోగానే తెలిపి వుంటే అనిత తనను అపార్థం చేసుకొని వుండేది కాదు ' అనిపించింది కాని అది క్షణమే

'అనుమానంతో వేధించ బడుతున్న ఆమెకు తన ప్రతి చర్యలో తప్పే కనిపిస్తుంది అది అబద్ధం కాదని ఆమె నిరూపించింది గూడా...' మరవాలనుకున్నా మరవలేని జ్ఞాపకాలు అతడ్ని వెంటాడుతూనే వున్నాయి

**(ఇంకా ఉంది)**



# అందరూ పొందాలనుకొనేది 'థ్రిల్' అనుభవం

థ్రిల్ పరిమళంతో ఉత్సాహాన్ని పొందండి!
ఉల్లాసంగా ఉండండి!
థ్రిల్! మీకోసం ప్రత్యేక సుగంధ ద్రవ్యాలతో
తయారు చేయబడినది. మీ శరీరానికి మృదుత్వమును
సహజ సౌందర్యమును పెంపొందింప చేయు సబ్బు.
థ్రిల్ ఓ క్రొత్త అనుభూతిని కలిగిస్తుంది.







## థ్రిల్

పరవశింపచేయు సబ్బు.



(గత సంచిక తరువాయి)

ఎంత నిర్లిప్తంగా వుండాలనుకున్నా ప్రభావతమ్మ మనమరాలి యెడల అలా వుండలేకపోతోంది ఆమె మీద కొన్ని సందర్భాల్లో విసుగు కలిగినా అది తాత్కాలికం అందుకు ఆమె హృదయ ఔన్నత్యం సగకారణమ్మైతే, ప్రభాత ప్రవర్తన, స్వభావం మిగిలిన సగకారణం

"అలాగే వెళ్ళు తల్లీ" అంది

"ఏ సినిమాకు మామయ్యా" అంది కృష్ణచైతన్య వద్దకు వెళ్ళి `ఆమెకు హిందీ, ఇంగ్లీషు అర్ధంకావు తెలుగు సినిమాలకు వెళ్ళే అవకాశంకోసం చూస్తూ వుంటుంది

"ఏమో ఆ దయ్యం యిష్టం." అన్నాడు

ముగ్గురూ తీరిగ్గా తయారై యిప్పుడు వెళ్ళే కొట్లోకి వెళ్ళేసరికే ఫస్ట్ షో టైం అయ్యింది ఎలాగూ మొదటి ఆట అందదు కాబట్టి రాధ చీరె సెలక్షన్ తాపీగా చేసింది షాపులో వున్న చీరెలన్నీ తీయించింది విప్పించింది తనమీద వేసికుని అద్దంలో చూచుకుంది మధ్య మధ్యలో "అన్నయ్యా యీ చీరె యెలా వుంది?" అంటుంది.

అన్నింటికీ అతని వద్ద వొక్కటే జవాబు "బాగుంది "

"అన్నీ బాగున్నాయని రికమెండ్ చేస్తున్నావు నువ్వు వో షాపు పెట్టుకో "

"అవునవును ఆ షాపంతా నీకే సరిపోతుంది "

చిట్ట చివరకు సెకెండ్ షో టైం ఔతోందనగా రాధ ప్రభాత సహాయంతో రెండు చీరెలు ఎన్నిక చేసింది ప్రభాతకు రెండిటిల్లో ఆరంజ్ కలర్ శారీ నచ్చితే, రాధ పారెట్ గ్రీన్ కలర్ చీరెను యెంపిక చేసికుంది

కృష్ణ చైతన్యకు ఆరంజ్ కలర్ చెరె ప్రభాతకోసం తీయాలనిపించినా వివేకం హెచ్చరించడంతో మౌనంగా రాధ తీసికున్న చీరెకు చెక్ యిచ్చేసి బయటపడ్డాడు అతనికా షాపింగ్ పూర్తయ్యేసరికి సినిమా చూచే మూడ్ పోయింది ఆమాటే అన్నాడు.

రాధ అంగికరించలేదు "మళ్ళీ ఆ సినిమా యెన్నేళ్ళ కొస్తుందో" అంది

**జరిగిన కథ–8 :** రామస్వామి, ప్రభాతమ్మల పెద్ద కొడుకు కృష్ణచైతన్య, అక్కకూతురు రాజ్యలక్ష్మి చనిపోవడంతో ఆమె కూతురు ప్రభాతను తనతో కూడా తన ఇంటికి తీసుకు వచ్చేసింది ప్రభావతమ్మ ప్రభాత అమ్మమ్మ ఇంట్లో అందరితో బాగా కలిసి పోతోంది కృష్ణచైతన్య ప్రోద్భలంతో ప్రభాత మెట్రిక్ చదవడం ప్రారంభించింది కృష్ణచైతన్య ప్రభాత పట్ల శ్రద్ధ చూపడంతో ప్రభావతమ్మలో సంఘర్షణ ప్రారంభమయింది దీపావళి పండగకు కృష్ణ చైతన్య చెల్లెలు జయశ్రీ అందరికి కొత్త బట్టలు కొనుక్కొచ్చి ప్రభాత విషయం మరిచి పోతుంది కృష్ణచైతన్య అప్పటి కప్పుడు వెళ్ళి ప్రభాతకు చీర, జాకెట్ కొనుక్కొస్తాడు కృష్ణచైతన్య తమ్ముడు నందకిశోర్ తనో కన్నడ అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నట్లు అన్నతో చెప్తాడు రాధ కోరికపై ఆమెకు చీర కొనియ్యను అంగీకరిస్తాడు కృష్ణచైతన్య

అపారమ్మైన ధననష్టాన్ని యెదుర్కొంటున్న దానిలా దిగులుగా

"పోనీ ఓటింగ్ పెడ్దాం" అన్నాడు

"ఓటింగ్ యెందుకు? నువ్వే నెగ్గుతావు కదా! ప్రభాతకు సినిమాకు రావాలని వున్నా నీకోసం వద్దంటే అంటుంది "

అతడు మరేం మాట్లాడకుండా కారును థియేటర్ వైపు పోనిచ్చాడు టికెట్స్ తీసికున్నాక యింకా సమయం వుంది

"రాధా, ఆ రెష్టారెంట్‌లోకి వెళ్ళి యేమ్మైనా తీసుకుందామా?"

"నేనూ అదే అనుకుంటున్నానన్నయ్యా ఇంటికి వెళ్ళేసరికి పన్నెండౌతుంది

ముగ్గురూ థియేటర్ రెష్టారెంట్‌లోకి వెళ్లారు ఖాళీ ప్రదేశం చూచుకుని కూర్చోబోతూ వుండగా స్ఫుర ద్రూపి అయిన యువకుడు అరెయ్ కృష్ణా!' అంటూ భుజం చరిచాడు

అంత చనువుగా సంభోదిస్తున్న వ్యక్తిని జ్ఞప్తికి చేసికోవడానికి అరక్షణం పట్టిందతనికి

'మీరు నువ్వు శరత్ '

"గుర్తు పట్టినందుకు కృతజ్ఞతలు "

"ఎలా మర్చిపోతాన్రా? బాగా మారిపోయావు?'

నువ్వు అలాగే వున్నాననుకుంటున్నావా?"

శరత్ చేతిని తన చేతిలోకి తీసికుంటూ హాయిగానవ్వాడు

"ఎక్కడుంటున్నావు? ఏమి చేస్తున్నావు? అమ్మా, నాన్న, అన్నయ్యలు అందరూ క్షేమమేనా? వాళ్ళ విశేషాలేమిటి?"

'అలా గుక్క త్రిప్పుకోకుండా అడగకు అన్నీ చెప్తాను అంటూ ముందుగా తానొక కుర్చీలో కూర్చుని కృష్ణచైతన్యను కూర్చుండజేశాడు అప్పుడు అతని దృష్టి రాధ మీద పడింది

"రాధకదూ!" అంటూ కృష్ణ చైతన్యను అడిగి అతని జవాబును ఆశించ కుండానే "గుర్తులేనుకదా రాధా?" అన్నాడు

తనను కూడా పేరుతోనే సంభోదిస్తూన్న మనిషికి ఆ స్వతంత్రం యెలా వచ్చిందా అని యోచిస్తున్న రాధ 'లేదన్నట్లు" తల వూపింది

శరత్ వాళ్ళ కుటుంబం, రామస్వామిగారి కుటుంబం నిజాంబాద్‌లో చాలాకాలం కలసి మెలసి వున్నారు మధ్య మధ్యలో బదిలీలు, వున్నప్పటికి రామస్వామిగారు మొత్తం అక్కడ యేడుసంవత్సరాలకు పైనే వున్నారు శరత్ తండ్రి నాగేశ్వరరావుగారు కృష్ణాజిల్లానుండీ వచ్చి అక్కడ భూములు కొని స్థిరపడ్డారు అక్కడే వొకదాని వెంట వొకటిగా అనేక లారీలు కొని ఆ వ్యాపారాన్ని కొనసాగిస్తూ, భూములు పండించుకుంటూ మరికొందరు స్నేహితులతో కలసి సినిమా హాలు కట్టించారు ఆయన భార్య కమలమ్మ ఉత్తమురాలు నలుగురు పిల్లల్ని యెన్నడూ విసుక్కొని యెరుగదు అన్ని వ్యవహారాల్లోనూ ఆమెకు వోర్పు యెక్కువేనూ

రామస్వామిగారు మొదటిసారి ఆ వూరొచ్చినప్పుడు నాగేశ్వరావుగారింట్లో అద్దెకు దిగారు రెండు కుటుంబాలకూ స్నేహం కలిసింది పిల్లలు కూడా వొకే వయసువారవడంతో యేక కుటుంబీకులుగా మెలిగారు నాగేశ్వరావుగారి మూడవ సంతానమే శరత్ అతడు వయసులో కృష్ణచైతన్యకన్న రెండు సంవత్సరాలు చిన్నవాడు వారిద్దరికి మంచి జోడీ సెలవులు వస్తే చాలు కాలవో గంట్లవెంట యీతలుకొడుతూ, పొలాల వెంబడి తిరుగుతూ ఉండేవాళ్ళు వీర్ని పట్టటం యెవరి తరమూ కాదు నిజాంబాద్ నుండి చివరిసారి సెలవు తీసుకున్నాక ఆ రెండు కుటుంబాలూ వొకటి రెండు సార్లు కలుసుకున్నాయి గాని, తరువాత అదీ లేదు

కాలం, దూరం మనుష్యుల్ని వేరు చేసినా మనసుల్లోని మమతలు మాత్రం యిప్పటికీ పచ్చగానే ఉన్నాయి

శరత్, కృష్ణచైతన్యలకు గతమంతా కళ్ళకు కట్టినట్లయింది ఒకరిని చూచి ఒకరు నవ్వుకున్నారు ఆ నవ్వులో ఎన్నో భావాలున్నాయి గతంలోని అల్లరినీ,

ఆటపాటలనూ, అనురాగాలనూ మననం చేసుకుంటున్న నవ్వు అది. ఆ ఒక్క చిర్నవ్వు యిన్నో కబుర్లు చెపింది ఇన్నాళ్ల దూరాన్ని చెరిపివేయగలిగింది

శరత్, కృష్ణచైతన్య ఒకరి చేతులు మరొకరు పట్టుకుని కళ్లతో మాట్లాడు కుంటుండగా వెయిటర్ వచ్చాడు

"అన్నయ్యా ఆర్డరివ్వు"

ఎవరికేమి కావాలో కనుక్కుని ఆర్డరిచ్చాడు కృష్ణచైతన్య

మరలా యిద్దరూ తక్కిన యిద్దరిని మరచిపోయి కబుర్లలో పడ్డారు.

వారి ముచ్చట్లను బట్టి రాధకు శరత్ ఎవరో అర్థం అయింది ఆమెకు నిజాంబాద్ జీవితం లీలగా గుర్తు అప్పట్లో ఆమె చిన్న పిల్ల కావడం వలన ఆమె శరత్‌ను గుర్తించలేకపోయింది.

"ఇంతకూ నువ్వేమి చేస్తున్నావు?"

శరత్ ఎగ్రికల్చరల్ ఎం ఎస్ సి పూర్తిచేసి రాజేంద్రనగర్‌లో పనిచేస్తున్నాడు ఆ విషయమే చెప్పాడు

"మరి పి హెచ్ డి ఎందుకు చేయకూడదూ!" అన్న కృష్ణచైతన్యతో -

"చదువుకు అంతం యెక్కడ? నాకు నేను యిక్కడే ఫుల్‌స్టాప్ పెట్టాను" అన్నాడు

కబుర్ల మధ్య టిఫిన్ ముగించి లేచారు అప్పటికి థియేటరులో ఎడ్వర్టయిజు మెంట్సు వేస్తున్నారు. ఎక్కువ రష్ లేకపోవడం వలన నంబరింగ్ అబ్జర్వ్ చేయడంలేదు శరత్ కృష్ణచైతన్య ప్రక్కన కూర్చున్నాడు

"ఎవరా అమ్మాయి?" అన్నాడు గుస గుసగా

"ఎవరి విషయం నువ్వడిగేది? ప్రభాతా?"

"ఊ రాధ ప్రక్కన కూర్చున్న అమ్మాయి".

"అక్కయ్య కూతురు "

"హారి నీకు అక్కయ్య ఎప్పుడు పుట్టిందోయ్ "

"పెద్దమ్మగారమ్మాయి రాజ్యం అక్కయ్య "

"ఔనవును జ్ఞాపకమేను ఒకసారి నిజాంబాద్ వచ్చిందిగదా?"

కృష్ణచైతన్య "ఔ"నన్నట్టు సంజ్ఞ చేశాడు.

"ఆమెకు యింత కూతురా?" అని విస్తుపోయాడు

అసలు సినిమా ప్రారంభం కావడంతో కబుర్లు ఆగిపోయాయి ప్రదర్శన ముగిశాక ఒకరి అడ్రసులు మరొకరు పుచ్చుకుని పరస్పరం ఒకరినొకరు తమనివాసాలకు ఆహ్వానించుకున్నారు

"నువ్వు కూడా రావాలి రాధా" అన్నాడు శరత్

"థాంక్సు."

'ప్రభాతా నీకు ప్రత్యేకాహ్వానం కావాలా?" అన్నాడు

ప్రభాత సిగ్గుపడింది

'మమ్మల్నిందరిని ఆహ్వానిస్తున్నారు. మీ యింట్లో యెవరెవరున్నారు? – రాధ

"నేనొక్కడ్నే ఐతే రారా యేమిటి?'

'మేమేమో చాలా మందిమి ఉన్నాము మీరేమో ఒక్కరే ఉంటున్నారు కాబట్టి ముందు మీరే రావాలి" అంది రాధ

"ఓ కె ముందు నేనే వస్తాను తరువాత గూడా మీరు వచ్చినా రాకపోయినా నేనే వస్తాను "

ఆప్యాయంగా వీడ్కోలు పుచ్చుకున్నారు

శరత్ స్కూటరు మీద వెళ్లాక కృష్ణచైతన్య కారు వద్దకు దారితీశాడు ఇంటికి చేరాకనైనా నిద్రపోలేదు వారు క్రొత్తగా కొన్న చీర ప్రదర్శించింది రాధ

శరత్‌ను గూర్చి చర్చించుకున్నారు గత జ్ఞాపకాలను త్రవ్వుకున్నారు

"నాగేశ్వర్రావుగార్ని చూచి చాలా కాలమయింది ఒకసారి వెళ్లి రావాలి అన్నారు రామసామిగారు

"నేనూ వస్తాను నాన్నా' – రాధ

"అలాగే అందరం వెళ్దాం

ఒంటి గంట అయ్యేవరకూ కాలాన్ని గుర్తించకుండా గడిపారు. మరునాడు నిద్రపోతున్న ప్రభాతను ప్రభావతమ్మ మేల్కొపసాగింది ఆమెకు అమ్మమ్మ మాటలైతే వినిపిస్తున్నాయి గానీ మత్తు వీడటంలేదు నిద్ర కలిగిస్తున్న హాయిని వదులుకోను శరీరము, మనసు సిద్ధంగా లేవు బద్ధకంగా పొర్లింది

"ఎందుకమ్మా లేపుతావు? పాపం పడుకోనివ్వు అన్నాడు కృష్ణచైతన్య

'ఎనిమిది అవుతుంది వస్తూ పోతూ వుండే యిల్లు లోనికి యెవ్వరైనా అడుగు పెట్టి ప్రభాత యింకా నిద్రపోవడం చూస్తే ఏం బాగుంటుంది? లోపలకు వెళ్లి పడుకోనివ్వు "

'ప్రభాతా లే లేచివెళ్లి నా గదిలో పడుకో' మృదువుగా వినిపించిన అతని స్వరానికి ఆమె నాగస్వరం విన్న నాగినిలా లేచి కూర్చుంది

"వెళ్లి నా బెడ్ మీద పడుకో '

ప్రభాతకు నిద్ర మత్తు పూర్తిగా వదిలింది త్వరితంగా ముఖం కడుక్కుని పుస్తకాలు తీసుకు వెళ్లి అతని ముందు కూర్చుంది

ఆ చదువు తరువాత అంతకన్నా ముఖ్యమయిన పద్ధతులు నేర్చుకో అన్నాడు ఆమె పుస్తకాలు ప్రక్కన పెడ్తూ

ప్రభాతకు భయం, సిగ్గు కలిగాయి ఈ రోజు ఆలస్యంగా నిద్రలేచింది ఆలస్యమయ్యిందని స్నానం చేయకుండానే చదువుకోడానికి వచ్చింది ఆ విషయం చెప్తాడేమో! ఛ ఎంత పొరబాటు జరిగింది తను సినిమా నుండి రాగానే పడుకుని వుంటే కొంచెం ముందుగా లేవగలిగి ఉండేది యింకెప్పుడూ సెకండ్‌షోకు వెళ్ళకూడదు పిన్ని కాదు మామయ్య బలవంతం చేసినా సరే గట్టిగా మనసులో నే నిర్ణయించుకుంది.






# మౌనవిపంచి

ఏమిటీ మౌనవ్రతం పట్టావు?

"చెప్పు మామయ్య"

"నువ్వు క్రొత్తవారిని, మనవారిని చూచి సిగ్గుపడటం మానెయ్యాలి"

ప్రభాతకు మామయ్య చెప్పేదేమిటో వెంటనే తలకెక్కలేదు

"అవును అలా అనవసరమైన సిగ్గును ప్రదర్శిస్తే యెబ్బెట్టుగా వుంటుంది వినయ విధేయతలతో కూడిన ప్రవర్తనను అందరూ ఆదరిస్తారు రాత్రి చూడు– శరత్ నిన్ను తన యింటికి ఆహ్వానిస్తున్నపుడు నువ్వలా బిడియ పడకూడదు సిగ్గు పడకూడదు ధైర్యంగా మాట్లాడాలి నవ్వుతూ థాంక్సు చెప్పి వార్ని కూడా మన యింటికి ఆహ్వానించాలి అలాగే యింటికెవరైనా వస్తే సిగ్గుపడి లోపలకు పారిపోడదు వారడిగిన ప్రశ్నలకు తాపీగా జవాబు లివ్వాలి"

ప్రభాత అన్నింటికీ తలవూపింది

"చదువు మరి యిక రాత్రికే నువ్వీపూట చదువుకునే మూడ్‌లో లేవు"

అతడు చెప్పిన మాటలను మననం చేసికుంటూ వెళ్ళింది ప్రభాత అతడు అవకాశం లభించినపుడు అవుసరం అనుకున్న ప్రతి విషయం చెప్తున్నాడు అందువలన ఆమె తన పద్ధతుల్లో మార్పు తెచ్చుకుంటోంది క్రమంగా అతడు ఆమెకు సోషల్ బిహేవియర్ నేర్పసాగాడు తరచు రాధతో ఆమెను గూడా బయటకు తీసికు వెళ్ళసాగాడు ప్రభాత వేష, భాషాలంకరణలో అతడూహించిన తీరు రావడానికి అట్టే కాలం పట్టలేదు ఆమె అతి జాగ్రత్తగా అతడు చెప్పే విషయాలను గమనిస్తోంది.

మధ్యాహ్నం పన్నెండు గంటల సమయంలో ప్రభాత మామయ్య కుర్చీలో దర్జాగా కూర్చుని చదువుకుంటోంది గణ గణ మంటున్న ఫోన్ని యెవ్వరూ యెత్తడంలేదు మామయ్య మాటల్ని మననం చేసికుంటూ వెళ్ళి రిసీవ్ చేసికుంది

అవతల శరత్ మాట్లాడుతున్నాడు

"మీరా! బాగున్నారా?" అంది మామయ్య పాఠం గుర్తు చేసికొంటూ,

"బాగున్నాను మీరంతా కులాసానా?"

"హుఁ అందరమూ మీ కోసం ఎదురు చూస్తున్నాము అమ్మమ్మ తాతయ్య కూడా"

ఆమె మాటలు పూర్తి చెయ్య నివ్వకుండా "ఒ కె నేను వస్తున్నాను" అన్నాడు

"ఎప్పుడు?"

'ఈ సాయంత్రం వస్తాను అన్నట్టు రాధ లేదా?'

"పిన్ని కాలేజీకి వెళ్ళింది'

"మరి నువ్వు వెళ్ళలేదు"

ఒక్క క్షణం మౌనం

నేను ప్రైవేట్‌గా వ్రాస్తున్నాను"

'గుడ్, సాయంత్రం కలుద్దాం బై"

అతడు పెట్టేసిన ధ్వని విన్నాక ప్రభాత ఫోన్ పెట్టింది

"ఇప్పుడు మామయ్య వినాల్సింది తానెంత నిర్భయంగా మాట్లాడింది రాధ పిన్నిలా మాట్లాడింది"

ఆ సాయంత్రం కృష్ణచైతన్య వస్తుండగనే యెదురెళ్ళింది అతడు వరండా మెట్లు యెక్కబోతుండగా మామయ్యా యిప్పుడు శరత్ అదే మొన్న సినిమా హాల్లో కనుపించినాయన వస్తున్నారు" అంది

'ఎలా తెలిసింది?"

"ఫోన్ చేశారు మధ్యాహ్నం. నేనే మాట్లాడాను'

అంటూ అక్షరం పొల్లుబోకుండా అతనికి వివరించింది

కృష్ణచైతన్యకు యిప్పటికి అర్థమయ్యింది ఆ సంతోషానికి వెనుకనున్న కారణం నవ్వుకున్నాడు

అమ్మమ్మ ఆయన వస్తున్నారని స్వీట్ చేసింది బేకరీ నుండి బిస్కట్స్ తెప్పించింది

వెరీ గుడ్ సాధ్యమైనంత వరకూ స్నేహితుల ఇళ్ళకు ముందుగా తెలియ చేసి వెళ్తే బాగుంటుంది'

ఇది మరో పాఠమని గ్రహించిన ప్రభాత తలవూపింది

శరత్ వస్తూనే తనతో పాటు వుత్సాహాన్ని, చైతన్యాన్ని వెంట బెట్టుకు వచ్చాడు అతని స్వభావం చిన్నతనం నుండీ అంతే గలగల పారే సెలయేరు తన చుట్టూ వున్న వారికి వుల్లాసాన్ని కలిగించి వుత్తేజ పరుస్తాడు అందరితో కలుపుగోరుగా వుంటాడు త్వరగా స్నేహం చేస్తాడు మనసిచ్చి మాట్లాడుతాడు ఇలాటి స్వభావుడైన అతడు ఎదుటి వారిని త్వరగా ఆకర్షిస్తాడు

ఎన్నాళ్ళ నాడో స్నేహానికి ప్రతీకమైన శరత్‌ను చూడాలని రామస్వామిగారు, ప్రభావతమ్మ వువ్విళ్ళూరారు వారి వూహలు చాలా తలక్రిందులు కాలేదు శరత్ హృదిలో ఆ నాటి స్నేహలత వాడిపోలేదు నిత్యం స్వచ్ఛగా వుంటూ అందమైన పూలు పూస్తోంది ఆ విషయం అతని చేతలలో, మాటలలో వ్యక్తమవుతోంది అతన్ని చూచి రామస్వామిగారు, ఆయన సతీమణి ముగ్ధులయ్యారు

నిన్ను చూస్తుంటే మీనాన్నను చూస్తున్నట్టుందోయ్ అన్నారాయన

"నాకూ అంతేనండీ మిమ్మల్ని చూస్తుంటే నాన్నగార్ని చూస్తున్నట్లే వుంది" పైకి చమత్కారంగా అనిపించే ఆ మాటలవెనుకనున్న మన్నన, ఆప్యాయతలను ఆయన అర్థం చేసికున్నారు

రాధను అతడు చిర్నవ్వుతో పలకరించాడు

"మొన్న కొన్న చీరెను వోపెన్ చేశావా లేదా?" అన్నాడు

రాధ విస్తుబోయింది ఇతనికి ఆ రోజు తాను చీరె కొన్న విషయం యెలా తెలుసు? కనీసం మాటల మధ్య ఆ ప్రస్తావన కూడా రాలేదు

అదే మాటే అడిగింది

'ప్రశ్నకు ప్రశ్న జవాబు కాదు

"ముందు నా ప్రశ్నకు బదులివ్వండి తరువాత నేను చెప్తాను"

సరే నా ప్రశ్నకు, నీ ప్రశ్నకు నేనే జవాబిస్తాను ఆ రాత్రి నీ చేతిలో వున్న కవర్ను నువ్వెంతో అపురూపంగా పట్టుకున్నావు"

"ఓహ్ ఆ కవరు మీద పేరు చూడగానే మీకు తెలిసుంటుంది అందులో వున్నది బట్టలని

"బట్టలని ఎవ్వరైనా చెప్పగలరు కానీ ఒక అందమైన, విలువైన చీరని యెందరు చెప్ప గలరు? ఇక నా ప్రశ్నకు జవాబు వినండి. నువ్వా చీరను రిపబ్లిక్ దినోత్సవం నాడు ధరిచావు మీ స్నేహితులంతా మెచ్చుకున్నారు మా అన్నయ్య ప్రెజెంట్ చేశాడని నువ్వెంతో గొప్పగా చెప్పేశావు"





గోడకూలి దొంగ చచ్చిపోయాడు



ఆ గోడ కట్టిన మేస్త్రిని ఉరితీసేయండి





మహాప్రభో! మేస్త్రి పొడుగైపోయాడు అతన్ని....
.... ఉరితీయడం కుదరదు
వెధవల్లారా ఆమాత్రం తెలియదా. ఒక పొట్టి మేస్త్రిని తీసుకొచ్చి ఉరితీయండి



ఆగండి మహాప్రభూ! వాడు నిరపరాధి. నాణ్యమైన నాగార్జున సిమెంట్ నే కొనమని అతను ముందే చెప్పాడు
SATYAMURTY-MAM NC

అవే మీ కెలా తెలుసు?

అతడు నవ్వాడు

"మీ వాళ్ళెవరైనా మా కాలేజీలో వున్నారా?"

మళ్ళీ నవ్వాడు

ఆమెకు యిదంతా గమ్మత్తుగా వుంది. నిజంగానే ఆమె ఆ చీరెను రిపబ్లిక్‌డే నైట్ ఫంక్షన్‌కు ధరించింది ఆ లైట్ల వెలుగులో ఆ చీర ధగ ధగా మెరిసి పోయింది క్లాస్‌మేట్సంతా తెగ మెచ్చుకున్నారు. వాళ్ళందరికీ "మా పెద్దన్నయ్య కొని పెట్టాడు యిది ఇలాంటిదే ఉగాదికి చిన్నన్నయ్య చేత కొనిపించుకుంటాను" అని కోసేసింది

అయితే ఈ విషయాలన్ని అతనికెలా తెలిసినట్టు?

చెల్లెలి అవస్థ చూస్తుంటే కృష్ణచైతన్యకు నవ్వు వచ్చింది. జాలీ కలిగింది.

"అసలు అన్నయ్య కొన్నారని మీ కెలా తెలుసు?"

శరత్ తేలిగ్గా నవ్వేస్తూ "లేకుంటే వాడు యిద్ద రాడపిల్లల్ని తీసుకుని యెందుకొస్తాడు షాపింగ్‌కు?" అన్నాడు

"అయితే యిదంతా తమరి వూహాగానమా?" అంది చిరునవ్వుతో.

అందర్తూ హాయిగా నవ్వుకున్నారు.

శరత్ ఆ రాత్రి భోజనం చేసి పది గంటల వరకూ అక్కడే గడిపాడు. ఈ సారి ప్రభాత కూడా వారితో కలిసి కూర్చుంది చాలాసేపు వారి చర్చలో భాగం తీసుకోనప్పటికీ ఈ మార్పులు అందరూ గుర్తించారు కృష్ణచైతన్య తప్ప మిగిలిన వారంతా ఆమె శరత్ కబుర్లకు, హాస్యాలకు వచ్చి కూర్చుందనుకున్నారు

ఆ రాత్రి అయిష్టంగానే శరత్ కదిలాడు

మరెవ్వరికీ కూడా అతన్ని వదలడం యిష్టంగాలేదు

అయినా తప్పదు కాబట్టి అతడు వెళ్ళి పోయాడు

అతడు వెళ్ళాక హృదయంలోని వుల్లాసాన్ని ఏదో అదృశ్య శక్తి లాగివేసినట్లనిపించింది రాధకు

'మళ్ళీ వస్తే బాగుండును' అనుకుంది

ఆమె వుద్దేశం గ్రహించినట్లుగానే శరత్ తరువాత ఆదివారం వచ్చాడు వస్తూనే "అంటీ బాచిలర్ తిండి విసుగెత్తి పోయింది ఆదివారం కదా మీ చేతిలో స్పెషల్ వంట రుచి చూడాలని వచ్చాను " అన్నాడు

"అలాగేనయ్యా ప్రతి ఆదివారం భోజనాలకు యిక్కడకే రావాలి '

"అంటే మధ్యలో . ?" అంటూ ఆపేసి ఫక్కున నవ్వాడు అప్పటికే రాధ స్నేహితులతో మార్నింగ్‌షో సినిమాకు ప్రోగ్రాం ఫిక్స్ చేసికొని వుండటం వలన అతను వచ్చేసరికి తయారవుతోంది

హఠాత్తుగా వంట గదిలోకి వచ్చి "అమ్మా! తల పగిలి పోతూంది ఆస్ప్రో వేసికుంటున్నాను గానీ కొంచెం కాఫీ యిస్తావా?" అంది

అక్కడే హాల్లో కూర్చుని కృష్ణచైతన్యతో మాట్లాడుతున్న శరత్‌కు యీ మాటలు వినిపించి" రాధా నన్ను చూడగానే నీకు తలనొప్పి వచ్చినట్లుంది?" అన్నాడు

"అబ్బే ఆలా కాదు" అంది కంగారుగా

ప్రభావతమ్మ శరత్‌తో పాటు రాధకూ ఓ కప్పు కాఫీ యిచ్చి "యీ తలనొప్పితో ఆ సినిమాకు వెళ్ళక పోతేనేం?" అంది

కాఫీ ఆయితే యిచ్చింది గానీ నిజంగా కూతురు మందుబిళ్ల వేసుకుందో లేదో ఆమెకేం తెలుసు?

"అదే ఆలోచిస్తున్నానమ్మా. నా ఫ్రెండ్సంతా యిప్పటికే బయలుదేరి వుంటారు వాళ్ల కెలా తెలియ చెయ్యాలి?"

"నీ కోసం చూచి వాళ్లే వెళ్తారు కాకుంటే నీకు ఫోనుచేస్తారు "

రాధ తేలిగ్గావూపిరి పీల్చింది

"తలనొప్పి వస్తే సినిమా చూడాలి నేనైతే అంతే చేస్తాను నిజం రాధా నువ్వు సినిమాకు వెళ్ళు వచ్చేసరికి బాధ తగ్గిపోతుంది" అన్నాడు శరత్ కాఫీ సిప్ చేస్తూ

అతని మీద రాధకు అంతులేని కోపం వచ్చింది తనెందుకు తన ప్రోగ్రాం విరమించుకుంది? ఆ విషయం అతడు గ్రహించనందుకు తన మీద తానే జాలీ

పడుంది నిస్సహాయురాలై అతన్ని కొరకొరా చూసింది

ఆ కొర చూపులకు నవ్వుకుంటూ పోనీలే రాధా వెళ్లకు కాని ముస్తాబంతా వేస్టయింది భైదిభై ఆ చీర క్రొత్తదా?

అతడు వేళాకోళం చేస్తుంటే రాధకు కోపం యెక్కువైంది.

"రాధకు కోపం యెక్కువ' అన్నాడు కృష్ణచైతన్య

"మీరిద్దరూ కలిసి నన్ను ఆటపట్టిద్దాం అనుకుంటున్నారేమో ఆ పప్పులేవీ వుడకవు '

'ఏ ఆట ఆడదాం? శరత్ సిరియస్‌గానే అడిగాడు

రాధకు జౌట్‌డోర్ గేమ్సు తప్పించి యిన్‌డోర్ గేమ్సు యేమీ తెలియవు. రమ్మీ కొద్దిగా తెలుసు అతడేమో ఆటకు రమ్మని కవ్విస్తున్నాడు వెళ్లకుండా యెలా వుండటం?"

రమ్మీ ఆడదాం"

'ఒ కే మరి కార్డ్సు వున్నాయా?"

కృష్ణచైతన్య వెళ్లి కార్డులు తెచ్చాడు

ఆట ప్రారంభించబోతుండగా రామస్వామిగారు "నేనూ ఆడతాను" అంటూ వచ్చారు

'ఒ కే నాలుగ్గు చేతులైతే ఆట జోరుగా వుంటుంది. కానివ్వండి "

"బెట్ లేకపోతే ఆట చప్పగా వుంటుంది' అన్నారు రామస్వామిగారు

'చెప్పండి బెట్ యేమిటో '

"రాధ గెలిస్తే మనమంతా కలిసి తనకో చక్కటి ప్రెజెంట్ యివ్వాలి "

శరత్ ప్రతిపాదనకు రాధ సగం మాత్రమే అంగీకరించింది

"కలిసి అంటే నేనొప్పుకోను ఎవరిది వాళ్లే యివ్వాలి "

'ఏమి కావాలో ముందే చెప్పు తరువాత దెప్పుతావు"– కృష్ణచైతన్య

"మీరు మనస్ఫూర్తిగా యేదిస్తే అది తీసుకుంటాను '

"నిజమేనా?"

'నిజంగా."

"మరి మన ముగ్గురిలో యెవ్వరైనా గెలిస్తే?"

సాయంత్రం సినిమాకు తీసుకు వెళ్లి ఆంటీకి శ్రమలేకుండా హోటల్లో భోజనాలు యేర్పాటు చేయాలి."

ఒకే రాధా, మరి నువ్వు సిద్ధమేనా?" కృష్ణచైతన్య

"రాధా? ఓడిపోవడమా" క్రీ గంట ఆమెన్ను గమనిస్తూ "ఆమె వోడిపోవడమే మనకొక గిఫ్ట్"

శరత్ పలుకులకు వుడుక్కుంటూ "అన్నయ్య యీ పద్ధతికి నేను వొప్పుకోను నేను గెలిస్తే మీరేమిస్తే అది పుచ్చుకోవాలి కాబట్టి మీరు గెలిచినా నేనేమిస్తే అది తీసుకోవాలి' అంది

'కరెక్ట్‌గా చెప్పావమ్మా" మెచ్చుకున్నారు తండ్రి.

ఒడంబడిక కుదిరాక ఆట ప్రారంభం అయ్యింది కోతప్రకారం రాధ శరత్ కుడిప్రక్కకు వచ్చింది అక్కడ యిద్దరికీ పేచీ

'మీరు నా ముక్కలు చూస్తున్నారు" అంటుంది రాధ

'అలా నిందలు వేయకూడదు" అంటాడు శరత్

'ఎక్కడ చూస్తున్నాడమ్మా చూస్తే నీ క్కావల్సిన ముక్కలు అన్ని యెలా వేస్తాడు? రామస్వామిగారు సర్ది చెప్పారు

ఆట మొదలైన కొద్ది సేపటికే కృష్ణచైతన్యకు ఆ గేమ్ రాధ గెలవబోతున్నదని అర్థమైంది

"నువ్వు నిశ్చింతగా నీ ముక్కలు శరత్ వైపు త్రిప్పి పట్టుకో అన్నాడో సారి.

"ఛ ఛ నేను చూడందే" శరత్.

నీ కంతగా రాధకు ప్రెజెంటేషన్ యివ్వాలని వుంటే యిచ్చుకో మమ్మల్ని కూడా యెందు కిరికించావు?' కృష్ణచైతన్య

అప్పటికి రాధ వరుసగా మూడు ఆటలు త్రిపింది మూడు ఆటల్లోనూ వరుసగా మూడు రౌండ్సులో ఆమెకు కావాల్సిన ముక్కలు వేశాడు శరత్

'అన్నయ్యా నువ్విలా మాట్లాడితే వొప్పుకోను నీకంత వుక్రోషం కూడదు '

'సరేలే తల్లీ.. సరేలే,' సర్ది చెప్పుకున్నాడు

మొత్తానికి యెలాగైతేనేం పందెం గెలిచింది రాధ

'నాకేమిస్తారు?'

'ఇచ్చేవరకూ వేచి వుండాలి '

'పందానికి పైపందెం కాయి రాధా

'నేనికి ఆడలేను' లేచింది

ఆమె తెలివికి అందరూ నవ్వారు

'నాకసలే తలనొప్పి '

'ఇందాకటి సాకే కదా!' కృష్ణ చైతన్య

ఎవరెంత ఎగతాళి చేసినా ఆమె మరి ఆడతలంచలేదు చక్కగా మూడు బహుమతులు వస్తాయి ఆశకుపోయి వాటిని వదులుకోవడం ఆమెకు సుతరామూ యిష్టంలేదు

'అమ్మా రాధకు కాఫీ యివ్వు పాపం నిజంగానే తలనొప్పి వచ్చింది '

కృష్ణచైతన్యను కొరకొరా చూసింది

'అలాగే నాకూ ఓ కప్పు'– రామస్వామిగారు

''అఖ్ఖర్లేనిది యెవరికి '

'ఆడవద్దులె. ఉరికే కూర్చుని చూడు. ఎంతైనా విన్నింగ్ హాండ్‌కదా నీ చూపూ తాకినంత మా ముక్కలు. ' రాధ విసవిసా వెళ్ళిపోవటంతో శరత్ వాక్యం పూర్తి చెయ్యలేదు

మధ్యాహ్నం భోజనాలయ్యాక లో కాభిరామాయణం ప్రారంభమైంది ప్రభాత కొద్దిసేపు కూర్చుని వెళ్ళిపోయింది. పరీక్షలు దగ్గరకు రావడం వల్ల యేక దీక్షగా చదువుతోంది యీ మధ్య.

సాయంత్రం సెలవు తీసికుంటూ తన యింటికి తరువాతి ఆదివారం రావలసిందిగా కోరాడు శరత్.

'ఆదివారాలు నువ్వే వస్తూ వుండు మేము మధ్యలో యెప్పుడైనా వస్తాము

'ఒ కె వచ్చేముందు మాత్రం ఫోన్‌చెయ్యి కృష్ణా '

'లేకుంటే ఆయన యింటి పట్టున వుండరన్నయ్యా '

'కరెక్ట్‌గా చెప్పావు రాధా నా విషయం నీకెలా తెలిసింది. మా నైబర్స్ యెవరైనా మీ కాలేజీలో వున్నారా?'

అంటున్న శరత్‌ను చిత్రంగా చూచింది రాధ ఇతనికి మాటలు నాలుక చివరే వుంటాయి. ఇంత కాలానికి తనుకూడా అతన్ని జోక్ చేయగలిగానన్న సరదాను అరక్షణమైనా నిలువనీయకుండా తానన్న మాటల్నే త్రిప్పి కొట్టాడు

ఆమె వుక్రోషం చూస్తున్న కొద్దీ అతని ఆనందం అధికమౌతుంది నవ్వుకుంటూ శెలవు తీసికున్నాడు

అతను ఆ తరువాత ఆదివారం కూడా వస్తాడని ప్రభావతమ్మ అతనికూడా వంట చేసింది ప్రతి ఆదివారం సినిమాలకో, స్నేహితుల యిళ్ళకో వెళ్ళే రాధ ఆరోజు యిల్లు కదలకుండా వుంటే తల్లికి ఆనందంగానూ, ఆశ్చర్యంగానూ వుంది.

'ఏంరాధా యీరోజు యెటూ వెళ్ళటంలేదా?' అంది అనుమానంగా, లోలోన మర్చిపోయిన వ్యవహారాన్ని గుర్తు చేసినట్లవుతుందేమోనని భయపడుతూనే

'లేదమ్మా. పరీక్షలు దగ్గరకొస్తున్నాయి కదా. ప్రతి ఆదివారం యింట్లోనే వుండి బాగా చదవాలనుకుంటున్నాను '

'ఇన్నాళ్ళూ పుస్తకం పట్టకుండా తిరిగావు ఇకనైనా జాగ్రత్తగా చదువుకో' కూతురు మాటలు నమ్మి హెచ్చరిక చేసింది

శరత్ కోసం వెయిట్‌చేస్తూ కృష్ణచైతన్య భోజనం ఒక గంట ఆలస్యంగా చేశాడు. మధ్యాహ్నం భోజనం, సాయంత్రం టీ, రాత్రి భోజనాలు ముగిశాయి. అతని జాడలేదు

రాధకు వుస్సురనిపించింది ఆమె బాధ ఆమెది అతను వస్తాడని కాలు కదపకుండా యింటి పట్టున కూర్చుంది. స్నేహితులంతా గండిపేట పిక్నిక్ వెళుతున్నా కుంటిసాకులు చెప్పి వెళ్ళకుండా తప్పించుకుంది

(ఇంకా వుంది)

# హైదరాబాదు నోట్ బుక్

## శ్రీ సురేంద్ర మోహన్ త్రిపాఠీ

శ్రీ సురేంద్ర మోహన్ త్రిపాఠీ సంస్కృత భాషా-ప్రియుడు ఒకమారు ఒక క్షేత్రానికి వెళ్లాడు అక్కడ పండాలు, పురోహితులు మంత్రాలు పఠించడం విన్నాడు అంతా తప్పుల తడక మనసు కుమిలిపోయింది పురోహితులే ఇన్ని తప్పులు చేస్తే మత విశ్వాసమున్న వారికి మంత్రాలపై గురి ఎలా కలుగుతుంది? వారిని ప్రబోధించడం అవసరమని ఆవేదన చెందాడు ఆ ఆవేదనలో

బ్రాహ్మణ జగో ఉన్నతికరో
ఇస్ దేశ కా కల్యాణహో
మాతృ భాషాహై తుంహారీ
ఫిర్‌సే తేరా ధ్యానహో
గురు తుంహీహో తుంహీ పురోహిత్
తీర్థమే పండా తుంహీహో
తుమ్‌సే సంస్కృత్ భీ నవనపే
తో ధరాకే ఖారహో-

బ్రాహ్మణుడా లే, ఉన్నతికి వెళ్ళు ఈ దేశానికి మేలు చేయి సంస్కృతం నీ మాతృభాష ఈ సంగతి మరొకసారి గుర్తుంచుకో నీవు గురువువి పురోహితుడివి క్షేత్రాలలో పండా నీవే సంస్కృతం నీవల్ల అభివృద్ధి చెందకపోతే, నీవు దేశానిక బరువు-అనే ఉద్బోధ కవిత వెలువడింది సంస్కృత ప్రచారానికి జీవితం అంకితం చేయడం అవసరమని తోచింది చేస్తున్న ఉపాధ్యాయ వృత్తిని మాని సంస్కృత ప్రచారానికి నడుం కట్టినాడు ఒంటరిగా ఏమి చేయగలం? ఒక సంస్థ ద్వారా అయితే ప్రచార కార్యక్రమం ముమ్మరంగా సాగుతుందనే, భావం దృఢపడింది పర్యటన ప్రారంభించాడు కాశీలో సార్వభౌమ సంస్కృత ప్రచార కార్యాలయం చేస్తున్న మహత్తర సంస్కృత ప్రచార సేవను చూచాడు ఆ సంస్థ ద్వారా తన అభీష్టం నెరవేరుతుందని నిశ్చయించాడు అక్కడే ఉండిపోయాడు ఆ సంస్థ కార్యక్రమం పరిశీలించాడు మనస్సు విశాల మయింది ఒక్క బ్రాహ్మణుల కోసమే కాదు, ప్రపంచంలోని ప్రతి మానవుని కోసమూ సంస్కృత ప్రచారం అవసరమని గ్రహించాడు ఆ సంస్థ నిర్వాహకులు మహా విద్వాంసులు శ్రీ వాసుదేవ ద్వివేదీ శాస్త్రిగారు ఆయన తన జీవితాన్ని సంస్కృతానికి అంకితం చేసినట్టివారు పిల్లల కోసం, పెద్దల కోసం గద్య పద్యాలలో, సంభాషణ, నాటకాల రూపంలో వందల కొలది గ్రంధాలు వ్రాసినవారు అనర్గళంగా సంస్కృతంలో ప్రసంగించగలవారు దేశం నాలుగంచులూ తిరిగి, నాగాల్యాండ్‌వంటి అనాది జాతి ప్రాంతాలలోను సంస్కృత ప్రచారం చేస్తున్నవారు ఈ సంస్థ లక్ష్యం దేశ విదేశాలలో సంస్కృత భాషా సాహిత్యాలను, భారత సంస్కృతిని ప్రచారం చేయడం; సంస్కృత భాషద్వారా వివిధ మనోరంజన కార్యక్రమాలు నిర్వహించడం, గ్రంథాలు ప్రచురించడం, పాఠశాలలు నడపడం, ఉత్సవాలు జరపడం, గ్రంథాలయాలు నడపడం-ఇత్యాదిగా ఉంది తన లక్ష్య సాధనకు ఇంతకన్నా మంచి ఆశ్రయం లేదనుకున్నాడు మంచి ఆశ్రయం, మంచి మార్గ దర్శకత్వం – ఇక ఏం కావాలి? సంస్కృత ప్రచారానికి అంకితమయిపోయాడు త్రిపాఠీ ఆ సంస్థలో మరొక సహచరుడు, మహా విద్వాంసుడు శ్రీ రామనాధ శర్మ జ్యోతిషీ ఆయన పని పురాణ ప్రవచనం, పూజా పురస్కారాలను సక్రమంగా, స్పష్టోచ్చారణతో నిర్వహించేట్టు చూడడం ఈవిధంగా సంస్కృత సేవకు శేష జీవితాన్ని అంకితం చేసిన సురేంద్ర మోహనుడు ఉత్తర ప్రదేశ్‌లోని ఫైజాబాద్ జిల్లా కమాల్‌పూర్‌లో 1946 జులై 5 వ తేదీన జన్మించాడు గోరఖ్‌పూర్, భాటో పార్ రాణీ, దేవరియాలలో విద్యాభ్యాసం చేసి ఎం ఎ, బి టి డి పట్టాలు పుచ్చుకున్నాడు ఎం ఏ లో ఆయన అభ్యసించింది సమాజ శాస్త్రం సంస్కృత భాష బి ఎ వరకు రెండవ భాష కొంతకాలం జనగణన విభాగంలో పర్యవేక్షకుడుగాను, మార్కెటింగ్ ఇన్‌స్పెక్టర్‌గాను పనిచేసి, పదేళ్లపాటు భాట్‌పార్ రాణీలోని పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడుగా పని చేశాడు ఇంతలో సార్వభౌమ సంస్కృత ప్రచార కార్యాలయాధినేత శ్రీ వాసుదేవ ద్వివేదీ శాస్త్రిగారితో పరిచయ మయింది ఆయన జీవిత లక్ష్యం, ఆయన ధోరణి, ఆయన ప్రవర్తనా తనకు నచ్చాయి తన జీవితమూ సార్థకం చేసుకోవాలనుకున్నాడు చేస్తున్న ఉద్యోగం మాని సంస్కృత ప్రచార రంగంలో దూకాడు మీరు బుద్ధునిలాగ మధ్య వయస్సులో ప్రజా సేవకు దిగారుగదా, శేష జీవితం ఇంకా 60 ఏళ్ళు ఇంత కఠోరంగా నడుపగలరా? అనడిగాను సంకల్పం ఉంటే కాని దేది?– అని ఆయన అన్నారు సురేంద్ర మోహనుడు మంచి రచయిత పిల్లల మనస్తత్త్వం బాగా ఎరిగినవాడు గనుక పిల్లల కోసం వివిధ విషయాలపై పెక్కు హిందీ పుస్తకాలు గద్య పద్య గేయాలలో రచించాడు పెక్కు రేడియో ప్రసంగాలు చేశాడు ఇలాటి ఉత్తముణ్ణి జనవరి మూడవ వారంలో రామంతపురంలో భారతీయ విద్యా వికాస సమితి ఏర్పాటు చేసిన బాల సంస్కృత సమ్మేళనంలో దర్శించే అవకాశం కలిగింది అలాటివారు రాష్ట్రానికి ఒకరిద్దరయినా వుంటే, ఏ సత్కార్యమైనా కొనసాగుతుంది

**ఉపశ్రుతి:–**

ఏమిటి? ఎంతసేపు కాచుకున్నా మీ హైదరాబాదులో బస్సులు సరిగా రావేం? వాటికి సమయ నియమం లేదా?– అనడిగాడు సంస్కృత ప్రచారైకజీవి సురేంద్ర మోహన్ త్రిపాఠీ, త్రిపాఠీజీ, మా రవాణా శాఖ కాలాతీత సంస్థ అది బస్సు డిపో తలుపులు తెరిచినప్పుడు అరుణోదయం బస్సులు గేటు గుండా బయలుదేరినప్పుడు సూర్యుడు రథమెక్కి వస్తాడు రవాణా శాఖ లేచిందే వేళ, నడిపిందే బండి– అన్నాడు సహ బస్సు సంచారి

–తిరుమల రామచంద్ర






ఇప్పుడు లభిస్తున్న

డిలక్స్

# నిరోధ్

మరింత నునుపైనది




సున్నిత మనస్కులైన దంపతులకు




★ ఉత్తమమైన నాణ్యత గలది.

★ ఎలక్ట్రానిక్ సాదనాలతో పరీక్షింపబడినది.

అన్ని పెద్ద పట్టణాలలో

విక్రయింపబడుచున్నది

సీరియల్

# కాగితపు పడవలు

యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

(గత సంచిక తరువాయి)

ఇద్దరు కాఫీ త్రాగిం తరువాత గదిలోకి వచ్చి ఎదురెదురుగ కుర్చీల్లో కూర్చున్నారు

'ఏమిటి సంగతి – ఇప్పుడు చెప్పు, "నవ్వుతూ అడిగింది జయ రామారావు గంభీరంగ ముఖంపెట్టి, 'జయా! నువ్వు నాకు కావాలి," అన్నాడు జయలక్ష్మి అతడి ముఖం చూచి ఫక్కున నవ్వింది

'ఏమబ్బాయి – ఇవాళ ఈ దుర్బుద్ధి పుట్టింది?"

"నువ్వు కావాలనుకోడం దుర్బుద్ధా?"

'కాదు మరీ – మరో పదిహేను రోజుల్లో మన పెండ్లి కదా తరువాత జీవితాంతం మనం ఒకర్ని ఒకరం కోరుకుని కలసి ఉంటే ఎవ్వరు అభ్యంతర పెట్టరు కదా – ఆలోచించు మరి '

"నాబాధ నీకు తెలియదు "

తెల్సులేవోయి నీ బాధ – నాకు మాత్రం బాధగా లేదనుకున్నావా ఇలా ఇద్దరం దూరంగా కూర్చుని మాట్లాడు కుంటుంటే – గాని మన పెండ్లి సంగతి మనం ఆలోచించాలిగా ఇంకా ఎన్నాళ్ళు చెప్పు ఈ ఎడబాటు – పట్టుమని పదిహేను రోజులు లేవు మరి "

"పెండ్లి అంత ముఖ్యమా?"

ఈప్రశ్నకు జయలక్ష్మి దిగ్భ్రమ చెందింది

ఏమిటి రాము ఇవాళ ఇలా మాట్లాడుతున్నావు?" తీక్షణంగ రామారావు ముఖంలోకి చూస్తూ అడిగింది

రామారావు కాస్త గాభరా పడ్డాడు

"మరేం లేదు – మనం పెండ్లి రేపే చేసుకుందాం నేను పదిహేను రోజుల వరకు ఆగలేను

"ఏమిటా తెలివి తక్కువ మాటలు ముహూర్తం పెట్టుకుని పెండ్లికి సన్నాహాలు జరుగుతుంటే ఇప్పుడు ఆగలేను, వేగిపోతున్నాను రేపే పెండ్లి చేసుకుందామంటే ఏమనాలో నాకు తోచటంలేదు రాము! కొంపతీసి నీకు మతిభ్రమించలేదు కదా?"

"నామతికేంలే బాగానే ఉంది జయా! నన్ను అపార్థం చేసుకోకు ఈ బాజా బజింత్రీల పెళ్ళివల్ల ఎంతో శ్రమ, ఎంతో డబ్బు ఖర్చు – నా కంతగా ఇష్టంలేదని ఇంతకుముందే నా ఉద్దేశాలు నీకు చెప్పేను – గాని నువ్వు వినిపించుకోలేదు

**జరిగిన కథ–15 :** సుబ్బారావు సుభద్రల పెళ్ళి జరిగి పోయింది జయలక్ష్మి తమ్ముడికి ఉద్యోగం వచ్చింది కుటుంబరావు జయలక్ష్మి పెళ్ళి జరిపించను అంగీకరిస్తాడు ఆ శుభ వార్తను రామారావుకి చెప్పింది జయలక్ష్మి వారి పెళ్ళి నిశ్చయమైంది వానలో తడిసిన జయ దగ్గడం ప్రారంభించింది మరునాడు ఆఫీసుకు రాకపోతే రామారావు కంగారు పడి పోతాడు జయలక్ష్మికి గుండెపోటు వచ్చింది డాక్టరు అన్ని టెస్టులు చేసి వ్యాధిని గురించి రామారావుకి చెప్పి కొన్ని మందులు రాసిచ్చి వాడమన్నాడు

అందులో ఏదో ఆత్మానందం ఉందని గొడవ చేసేవు నాకు చక్కగా నిన్ను రేపు సింహాచలం తీసుకుని వెళ్ళి దేముడి సమక్షంలో నీ మెడలో పుస్తెలు కట్టాలనుంది, తర్వాత నిన్ను నా కౌగిలిలోకి వెంటనే తీసుకోవాలనుంది "

జయలక్ష్మి ఒక నిముషంపాటు రామారావు ముఖంలోకి చూచింది రామారావు తలవంచుకున్నాడు జయలక్ష్మి లేచి వచ్చి రామారావు దగ్గరసా వచ్చి రామారావు మెడ చుట్టు చేతులు వేసింది

'రామూ! రేపు సింహాచలంలో పెండ్లంటే ఎలా – మన బంధువులందరికి మన పెండ్లి ముహూర్తం సంగతి తెలియజేసేంకదా అర్ధాంతరంగ కోవిల్లో ఇన్స్టెంటు పెండ్లంటే మన గురించి ఏమనుకుంటారో చెప్పు?"

రామారావు మాట్లాడలేదు జయలక్ష్మి నిట్టూర్చి – "సరే – రామూ! నేను కావాలన్నావు కదా – నీ కోరిక నేను కాదననుగాని మన పెండ్లి పదిహేను రోజుల తరువాత మాత్రం జరగాలి –ఏం?"

రామారావు జయలక్ష్మి తలను ప్రేమతో నిమిరి, ఆమె బుగ్గను తన పెదవులతో తాకి మెల్లగ లేవనెత్తి ఆమెను ఆమె మునుపు కూర్చున్న కుర్చీలో కూర్చో పెట్టేడు తను గదిలో పచార్లు చేయ నారంభించేడు జయలక్ష్మి అతడి ఆదరణకు, అతడి చర్యకి ఆశ్చర్యపోయింది అతడి మాటలకు, అతడి ప్రవర్తనకు ఆమెకు పొంతన తోచలేదు కొంత అటు ఇటు తిరిగేక రామారావు మాట్లాడేడు

"జయా! స్త్రీకి జీవితంలో వివాహమన్నది చాల ముఖ్యం కదూ?"

"స్త్రీ జీవితానికి పెండ్లి, భర్త, పిల్లలు ఉంటేనే పరిపూర్ణత కల్గుతుంది "

"అయితే నువ్వు నన్ను మరి ప్రశ్నించక రేపు పెండ్లికి ఒప్పుకోవాలి సింహాచలంలో మరే అట్టహాసం లేకుండ దేముడి సమక్షంలో నీ మెడలో తాళి కడ్తాను తరువాత ఇరువురం దండలు వేసుకుందాం అంతా ఒక్క నిముష కార్యక్రమం నా ప్రార్ధన అనుకొని ఒప్పుకో "

జయలక్ష్మికి ఏమీ తోచలేదు ఆలోచిస్తే తల దిమ్మెక్కి పోతుంది తను కాదంటే రామారావు తనకు దక్కడేమోనన్న భయం కల్గింది

"సరే రాము నీ మాటే కానియ్యి మన పెండ్లికి మీ వాళ్ళు మా వాళ్ళు వస్తారా నువ్వు వాళ్ళను పిలుస్తావా?"

"మా వాళ్ళు రారు – వాళ్ళకు నేను చెప్తే ఎన్నో అభ్యంతరాలు చెప్తారు. అందుకే నా కిష్టలేదు మీ వాళ్ళు అంటే మీ నాన్న, మీ అక్క, మీ తమ్ముడు మాత్రం రావచ్చు మీ చెల్లెలుకి చెప్పవద్దు వాళ్ళత్తవారంత వస్తామంటారు నాకిష్టంలేదు ఎలా మీ అక్కయ్యను, మీ నాన్నను వప్పిస్తావో ఆలోచించుకో "

"సరే రాము – నేను మా వాళ్ళతో మాట్లాడుతానులే మరి ఎన్ని గంటలకు వస్తావు"

"ప్రొద్దున్న తొమ్మిది గంటలకు మీ ఇంటికి వస్తాను అక్కడనుండి బస్సులో సింహాచలం వెళ్దాం నేను వచ్చేప్పుడు ని పెండ్లికోసం నేను కొన్న పట్టుచీర తెస్తాను అదికట్టుకుందువుగాని – ఏం?"

"అలాగే కానియ్యి "

ఈ సంభాషణ జరుగుతున్నప్పుడు జయలక్ష్మిలోగాని, రామారావులోగాని ఏ ఉత్సాహం లేదు బంధువులంతా ఏమంటారో అన్న చిన్న భీతి మాత్రం లేక పోలేదు

జయలక్ష్మి సాయంత్రమే కొత వలస చేరింది ముందు అక్క కమలమ్మకు తన పెండ్లి ముహూర్తంలోని మార్పును చెప్పింది కమలమ్మ మండిపడింది జయలక్ష్మి జవాబు చెప్పలేకపోయింది ఆఖరికి కమలమ్మకు ఓ అనుమానం కల్గింది

'ఏమే జయా! కొంపదీసి అన్నీ కానిచ్చేవేమిటి – ఎన్నో నెల?"

"ఛీ – పో– ఏమిటామాటలు నేనుగాని రామారావుగాని అట్లాంటి తొందర పాటు మనుష్యులంకాము."

"మరి పెండ్లికి తొందరపాటు దేనికి?'

నాకు తెలియదు – రేపుగాని నేను సింహాచలం వెళ్ళకపోతే మనం పెట్టే

ముహూర్తానికి రామారావు వచ్చి నన్ను పెండ్లి చేసుకోడు అంతవరకు నాకు తెల్సు అక్కా నన్ను అర్థం చేసుకో నేను నిస్సహాయురాలిని అతడి పట్టుదల చూస్తుంటే నాకు భయం కల్గుతూంది అతడికి ఈ పెండ్లి ఆర్భాటాలేమి ఇష్టం లేవుట "









## కాగితపు పడవలు

అయితే పుస్తె లెందుకు – ఈ మండే బంగారం ధరల్లో అవి కూడ దండుగ హాయిగా రిజిస్ట్రారు ఆఫీసుకు పోరాదూ.'

"అక్కా నన్ను ప్రశ్నించి ప్రయోజనం లేదు అతడి వాదన, తొందర నాకు అర్థం కాలేదు కాని నేను రామారావుని వదలుకోలేను అతని మాటను నేను వినవల్సిందే?"

జయలక్ష్మి జవాబు కమలమ్మను తృప్తి పరచలేదు ఆమె సందేహ నివృత్తి కాలేదు. మరి చేసేదేమిలేక తండ్రి ఈ గుడిలో పెండ్లికి అనుమతించేందుకు పూనుకుంది మొదట కుటుంబరావు ఎగ్గిరినప్పటికీ తరువాత మెల్లగ ఒప్పు కున్నాడు. దానికి వేరే కారణం లేకపోలేదు ఈ విధంగ డబ్బు ఖర్చు, పెండ్లికి ఎంతో శ్రమపడి చేయవలసిన యేర్పాట్లు చేయనవుసరంలేదని సంతోషించేడు కూడ

రామారావుకి తల్లిదండ్రులకు తన పెండ్లి సంగతి చెప్పే ధైర్యం లేక పోయింది ఎనిమిది గంటల బస్సుకే కొత్త వలసకు ఆ మరునాడు బయలు దేరేడు రామారావు తెచ్చిన పట్టుచీరను, కొత్త పంచల చాపును ఒక సంచీలో వేసుకుని సింహాచలంకు బయలుదేరేరు కొత్తవలసనుండి అందరు రామారావు తల్లిదండ్రులు రాక పోవడం అందరికి వెల్తిగానే ఉంది

సింహాచలంలో యధావిధిగ కోవిలలో పెండ్లి జరిగిపోయింది కుటుంబ రావు కొత్తవలసనుండి ఒక పురోహితుడ్ని కూడ తీసుకుని వచ్చేడు అతడు పుస్తె కట్టినప్పుడు వల్లించే మంత్రాలను వల్లించి తంతును పూర్తి చేసేడు పట్టు చీరలో జయలక్ష్మి, మధు పర్కం పంచలో రామారావు వెలిగిపోతున్నారు కళతో పెండ్లి తరువాత జయలక్ష్మి కోరికపైన సింహాచలంలోనే వధూవరులు ఫోటో తీయించుకున్నారు ఆ బట్టలతోనే

కొత్తవలస తిరిగి వచ్చిం తరువాత కుటుంబరావు బజారునుండి మిఠాయి తీసుకుని వచ్చాడు కమలమ్మ గబగబా వంట చేసింది. అందరు ఉల్లాసంతో భోజనం చేసేరు భోజనాలనంతరం జయలక్ష్మిని తీసుకుని రామారావు కంటకా పల్లి వెళ్ళేడు

కొత్త పెండ్లి కొడుకు, కొత్త పెండ్లి కూతురుగ ఇంట్లో కాలిడిన వీళ్ళను చూడగానే కామేశ్వరమ్మ, జనార్ధనయ్య నిర్విణ్ణులయేరు

'ఏమిట్రా ఈ వేషం,' అని గర్భిస్తు తల్లి అడిగింది

"మేమిద్దరం ఈ ప్రొద్దున్నే సింహాచలం కోవిలలో వివాహం చేసుకున్నాం – అంటే దేముడి ముందు దండలు మార్చుకున్నాం

"దండలు మార్చుకోవల్సిన ఖర్మ ఏం పట్టిందిరా దర్జాగా పందిరిలో నలుగురు పెద్దల సమక్షంలో మరో పదిహేను రోజులలో పెండ్లి జరగబోతుంటే ఇదేం తొందరపాటురా? దేనికని ఇలా అర్థంటుగ పెండ్లి చేసుకున్నావు చెప్పు?

జవాబు చెప్పలేక బేలగ తండ్రివైపు చూచేడు రామారావు జయలక్ష్మి బిత్తరపోయి నేలచూపులు చూస్తూ ఉండిపోయింది

"కారణం యేదయితేనేమిలే కాముడూ! వాళ్లిద్దరికి పెండ్లి చేద్దామను కున్నాం – వాళ్లిద్దరు పెండ్లి చేసుకునే వచ్చేరు కేకలువేసి ప్రయోజనంలేదు ముందు శుభ్రంగా వాళ్లకు హారతివ్వు," అని జనార్ధనయ్య తన మనస్సులోను కొడుకు చేసిన పనికి బాధగనున్న, భార్యకు నచ్చచెప్ప జూచేడు

"మీ రూరుకోండి మీ అలుసు చూసుకునే వాడిలా తయారయ్యేడు ఏమమ్మా మా వాడికి ఏ మంత్రం వేసేవోగాని నువ్వెలా ఆడిస్తే వాడలా ఆడుతున్నాడు నిక్షేపంలా గౌరవంగ పందిట్లో పెండ్లి చేసుకోకుండా ఇదేం బుద్ధి?'

జయలక్ష్మి కి కంటనీరు మరి ఆగలేదు

'క్షమించండి అత్తయ్యా – నాకు ఇష్టంలేదని ఎంత వేడుకున్నా వినక మీ అబ్బాయే మొండిగ ఇలా చేసేడు ఆడదాన్ని నేనేం చేయగలను చెప్పండి నలుగురిలో పెండ్లాడ్డం నాకు గౌరవం కాదూ?

"అమ్మా! ఈ విషయంలో జయదేమి తప్పు లేదు అంతా నా ఇష్టం మీదే జరిగింది '

"పోనీయవే- కొత్త పెండ్లి కూతురు కంటి వెంట నీరు కారకూడదు జరిగిందేదో జరిగిపోయింది వాళ్ళకి హారతిచ్చి కోడల్ని ఆచరంగా ఆహ్వానించు, అప్పుడే అందర్కి శుభం కల్గుతుంది. జనార్ధనయ్య కొంచెం గట్టిగానే భార్యకు చెప్పేడు.

మరి చేసేదేమీ లేక, భర్త చెప్పిన దాంట్లో విషయం లేకపోలేదని గ్రహించి భర్త చెప్పినట్లు చేసింది రామారావు హాయిగా గాలి పీల్చుకున్నాడు జయలక్ష్మి కోపంగ భర్త రామారావు వైపు చూచింది

కామేశ్వరమ్మ కార్యం మాత్రం తనింట్లో చేయదల్చింది ఆ మేరకు త్వరలో ముహూర్తం పెట్టుకుని రమ్మని భర్తను బయటకు తరిమింది సాయంత్రం కాఫీ ఫలహారాలు కాగానే రామారావు జయలక్ష్మిని కొత్తవలస బస్సు ఎక్కించి పంపిం చేడు మరునాడు ఆఫీసుకు విశాకకు తప్పక రమ్మని చెప్పేడు ఆ రాత్రంతా జయలక్ష్మి తెగని ఆలోచనలతో గడిపింది రామారావుకి నిద్రపట్టలేదు జీవితం గురించి, విధి ఆడే నాటకం గురించి ఎంతో తలచేడు. జయలక్ష్మి గురించి ఆలోచనలు సాలెగూడులా అల్లుకుని ఆమె యందు అనురాగంతో హృదయం భారమైంది తను జయలక్ష్మిని వదలుకోలేడు ఒక నిశ్చయానికి వచ్చేడు రామారావు

## కాగితపు పడవలు

మరునాడు కొత్తవలసలో ట్రయిను ఎక్కగానే జయలక్ష్మి ముఖంలోకి చూచేడు ఆమె వాలకం రాత్రంత నిద్రలేకుండ గడిపినట్లే ఉంది 'పాపం - జయ ఎంత బాధపడ్డదో." అని జాలిగా మనస్సులో అనుకున్నాడు కంపార్ట్మెంటులో రద్దీలేని ఓ మూలకు చేరేరిద్దరు

"జయా! మనం అనుకున్నట్లుగ వెంటనే తిరుపతి వెళ్లాలి ఆ దైవ దర్శనం చేసుకుని మనం అలా హనీమూన్‌కి పోదాం - ఏం?"

'మనం ముందు అనుకున్నట్లు ఏమీ చేయటంలేదు కదా." అని నిష్ఠూరంగ అంది

నామీద నీకు కోపం వచ్చింది కదూ? నిన్ను కంటకాపల్లిలో ఉండిపొమ్మంధామనే మా ఇంటికి తీసుకుని వెళ్లేను - గాని మా అమ్మ ముహూర్తం అని గొడవ చేయటంవల్ల నిన్ను మీ ఇంటికి పంపించవల్సి వచ్చింది "

'నాకీ ఆచారాలు ఇష్టంలేదు - నేను చాల అన్ ఆర్తో డాక్సు మనిషిని అని అమ్మతో వాదించలేక పోయేవేమి?"

'మా అమ్మతో నా? లాభంలేదు - ఆమె ఎవరి మాట వినదు "

ఆది కాదు నన్ను మా వాళ్ళను భయపెట్టి మీ ఇష్టానికి తిప్పుకున్నట్లు మీ వాళ్ళను చేయలేరు ఇంతకీ మీ అమ్మంటే మీకు చాల భయం - అవునా?"

నిజమే - జయా మా అమ్మంటే నాకు బెదురే. అందుకే మనం హనీమూన్‌కి ఎక్కడికేనా పారిపోదాం "

'నాకు తెలియక అడుగుతున్నా - మనం దొంగలలా ఎక్కడికైన యెందుకు పారిపోవాలి - మనం భార్యాభర్తలం కాదా?'

"అందుకే ధైర్యంగ ఇద్దరం ఒక నెలకు శలవు తీసుకుని ముందుగా అందరికి చెప్పి తిరుపతి వెళ్దాం తరువాత హైదరాబాదు, బెంగుళూరు పోయి - అలా సరదాగా కొన్నాళ్ళు గడిపి వద్దాం "

'అలా తిరగడానికి డబ్బు కావాలిగ ఉన్న డబ్బంతా తిరగడానికి ఖర్చుచేస్తే రేపు మనం ఓ చిన్న యిల్లు విశాఖలో తీసుకుంటే ఆ ఇంట్లోకి ఫర్నిచరు, సామాన్లు ఎలా కొనగలం?"

"జయా! డబ్బు సంగతి నేను చూసుకుంటాగా నువ్వు ఇవాళే ఓ నెల్లాళ్ళకు శలవు దరఖాస్తు పెట్టు - ఎల్లుండి మనం బయలుదేరి తిరుపతి తప్పక వెళ్లాలి "

"సరే - శలవు తీసుకుంటాలే "

రామారావు ఆఫీసుకు చేరగానే శలవు దరఖాస్తు పెట్టేడు నెల్లాళ్ళకు తన ప్రొవిడెంటు ఫండులోనుంచి ఓ మూడు వేలు అడ్వాన్సు ఇవ్వమని మరో దరఖాస్తు పెట్టేడు ఆ మరునాటికి శలవు మంజూరైంది. అడ్వాన్సు మూడు వేలు ఇచ్చేరు జయలక్ష్మి శలవు మంజూరు చేయించుకుని, తన బ్యాంకులోంచి ఓ ఆరు వందలు డ్రా చేసింది మధ్యాహ్నం జ్ఞాపకం వచ్చి రామారావుకి ఫోను చేసింది

"రాము! ఎంతసేపు నీ స్వార్థమే గాని నా ఆరోగ్యం గురించి పట్టించుకోవేమి? ఎంతసేపు పెండ్లి హనీమూన్ అంటావే గాని నా ఆరోగ్యం గురించి పట్టించుకోవేమి డాక్టరు దగ్గరకు వెళ్ళేవా? నా జబ్బేమిటో కనుక్కున్నావా? ఏమైనా మందులు తినాలేమో కనుక్కున్నావా?"

"ఐయామ్ సారి జయా! ఇప్పుడే కె జి హాస్పిటల్‌కి వెళ్తున్నాను సాయంత్రం బస్సు స్టాపులో కలుద్దాం "

రామారావు అయిదురోజుల క్రితం డాక్టరు వాసిచ్చిన మందులు బజారు కెళ్ళి కొనుక్కుని వచ్చేడు ఆ మధ్యాహ్నం సాయంత్రం ట్రయినులో ఆ మందులు జయలక్ష్మి కిచ్చేడు

"జయా! హాస్పిటల్‌కి వెళ్ళేను టెస్టు రిజల్ట్సు అన్ని చూసి హార్టులో కాస్త కొవ్వు చేరింది దాని నుంచే అప్పుడప్పుడూ ఈ నొప్పి వస్తుంది ఈ మందులు తింటే ఆ కొవ్వు కరిగిపోయి మామూలుగా ఆరోగ్యంగా ఉండొచ్చు అని కార్డియాలజీ స్పెషలిస్టు చెప్పేడు దీని గురించి భయపడనవుసరం లేదు అని చెప్పేడు ఈ కాగితంలో వ్రాసిన విధంగా ఓ పదిహేను రోజులు ఈ మందులు తిను-అంతే మరే బెంగా పడకు "

"బ్రతికించేవు! ఇదేదో గుండె జబ్బు అని భయపడి చచ్చేను నీ మాటలతో నాకెంతో బలం వచ్చింది ఇప్పుడు చెప్పు రేపు ఏ బండికి వెళ్దాం "

"వాల్తేరులో తిరుపతి ఎక్స్‌ప్రెస్ సాయత్రం ఏడు గంటలకు ఎక్కాలి నేను మధ్యాహ్నమే మీ ఇంటికి నా సూట్‌కేసుతో వస్తాను నువ్వు నీ పెట్టెలో బట్టలు సర్దుకుని రడీగా ఉండు నేను వచ్చేక ఇద్దరం కలసి బస్సులో విశాఖకు వెళ్దాం మీ వాళ్ళకు చెప్పేవు కదూ మన ఈ తిరుపతి ప్రయాణం గురించి "

"చెప్పేను- మా అక్కయ్య ఏమందో తెలుసా?"

"ఏమన్నారు?"

"రామారావు కొద్ది రోజుల్లె ఎంతగా ప్రవర్తిస్తున్నాడు పెళ్ళైనా నీ స్నేహితుడిలానే సంచరిస్తున్నాడు గాని నీ భర్తలా కాదు-ఏమిటో సంగతి?' అన్నాను ఆశ్చర్యపోతుంది నన్నడిగింది నాకే తెలియని విషయం నేనెలా చెప్పగలను' అని "ఏ వింత లేదు నేను కాస్త చొరవలేని మనిషిని నాకు కాస్త సిగ్గెక్కువ "

"అవును పాపం-నోట్లో వేలు పెట్టినా కరవలేని మనిషివి.'

(ఇంకా ఉంది)

---

కట్టగట్టి మొట్టమొదట బయటికి నెట్టినప్పుడే మనం మన దేశాన్ని బాగు చేసుకోగలుగుతాము

ఎవరో కొంతమంది తప్ప విస్కీ సీసాలు అందించే వాళ్లందరూ విదేశీ గూఢచారులు కారు పనులు సంపాదించుకోడానికీ, కాంట్రాక్టుల కోసం వ్యాపారస్తులు ఇచ్చినట్లే వాళ్ళూ ఇస్తున్నారు.- టెండర్లు తయారు చెయ్యడానికి కావలసిన సమాచారాన్ని సేకరించడానికి తస్సంబంధమైన వారికి కాంట్రాక్టర్లు లంచం ఇచ్చినట్లే ఇది కూడా లక్షల డాలర్ల విలువగల కాంట్రాక్టులని సంపాదించడానికి మీరు ఎంత పైదాకా వెళ్ళగలరో అంత పైకి వెళ్లాల్సి ఉంటుంది మీరు వెళ్ళగల అత్యున్నత స్థానం ఈ దేశంలో ప్రధాన మంత్రి కార్యాలయం. అక్కడే అన్ని అధికారాలూ కేంద్రీకృతమై ఉంటాయి. అన్ని నిర్ణయాలూ అక్కడే జరుగుతాయి. అవి

### స్కాచ్ విస్కీ సీసా.....

**( 6 వపేజీ తరువాయి)**

ఒకప్పుడు సఫ్దర్ జంగ్ రోడ్‌లోని ఒకటో నెంబరు ఇంట్లో తీసుకోబడుతూ ఉండేవి. ఈ దేశంలో మీరు ఒక "బాబు" గారిని చూడాలనుకుంటే అక్కడి జమానుకి మీ పేరు గల చీటీతో పాటు ఒక నోటుని కూడా జత చేసి ఇవ్వాల్సి ఉంటుంది. ఆ'బాబు' ఎంత చిన్నవాడైతే అంత చిన్ననోటు, ఎంత పెద్దవాడైతే అంత పెద్దనోటు కొద్ది సంవత్సరాల కిందట సఫ్దర్‌జంగ్ రోడ్డులోని ఒకటవ నెంబరు ఇంటిని సందర్శించిన ఒక వ్యక్తి చెప్పిన విషయం నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఫలాని సమయానికి ఆయన ప్రధానమంత్రిని చూడవచ్చుని ముందుగానే ఆయనకి అనుమతి లభించింది కానీ ఆ సమయానికి వెళ్లిన ఆయనకి ప్రవేశం లభించలేదు తర్వాత వచ్చిన వారెందరికో ఆ పెద్ద గదిలోకి ప్రవేశం దొరికింది చివరికి అక్కడ ఉన్న జమాను వార్తాపత్రిక ఒకదాని మడతలలో దాచి ఉంచుకున్న పది రూపాయల కాగితాలని లెక్కపెట్టుకునేంత వరకూ ఆయన బయటే ఉండిపోవాల్సి వచ్చిందట నేను ఎప్పుడూ అక్కడికి వెళ్లలేదు కాబట్టి ఆ సంఘటనకి సాక్ష్యాధారాలని నిరూపించలేను కానీ దానిని నేను నమ్ముతాను అందుకే పి. సి. అలెగ్జాండర్ కార్యాలయం సిబ్బంది స్కాచ్ విస్కీ సీసాలని, పరిమళ ద్రవ్యాలనీ స్వీకరించినందుకు దోషులుగా నిర్ణయించబడితే నాకేమీ ఆశ్చర్యం అనిపించదు. అవినీతి, డబ్బుతో నిండిన ఆ వాతావరణంలో అలాంటివి జరగటం అన్నది సర్వ సాధారణమైన విషయం □

*Printed and Published for Nageswara Rao Estates Private Ltd, by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3, Editor. S. Radhakrishna, Phones: P. B. X.: 61247, 61248 & 75667.*